# అన్నమాచార్య సంకీర్తన సౌరభం

ఆచార్య ఎస్. గంగప్ప

శశి ప్రచురణలు
'సుధర్మ'
సి-73, శ్రీనివాసనగర్ కాలనీ,
గుంటూరు - 522006.

# అన్నమాచార్య సంకీర్తన సౌరభం.

(CRITICAL & RESEARCH ESSAYS OF THE FRAGRANCE OF ANNAMACHARYA'S SANKIRTHANAS)


రచయిత :

ఆచార్య ఎస్. గంగప్ప

విశ్రాంతాచార్యులు, నాగార్జున విశ్వవిద్యాలయం.





ప్రథమ ముద్రణ : జూన్, 2002

ప్రతులు : 1000

వెల : రూ. 80/-

ప్రతులకు :

శ్రీమతి ఎస్. పార్వతమ్మ

శశీప్రచురణలు

'సుధర్మ' సి-73, శ్రీనివాసనగర్ కాలనీ,

గుంటూరు - 522 006.





This book is published with financial assistance of
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS under their scheme
'AID TO PUBLISH RELIGIOUS BOOKS'

ముద్రణ :

లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్

2/1, బ్రాడీపేట, గుంటూరు-522 002

ఫోన్ : 235036

# వి ష య సూ చి క



# ప్రవేశిక

తెలుగులో పదకవిత్వానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. పద్యం పండితులకు మాత్రమే పరిమితం. పదం సామాన్య ప్రజలందరికీ ఉద్దిష్టం. పద్యం కంటే పదం- అందులోని గీతిమాధుర్యంతోపాటు సంగీతసమ్మిళితమై ఆటకు, పాటకు సహకరిస్తూ ప్రజాసముదాయాన్ని అలరిస్తూ వచ్చింది. పద పద్యకవితల్లో పదమే ముందు పుట్టిందన్నది నిర్వివాదాంశం. లిఖితం కాక పోవడం వల్ల, పండితుల నిరసన, అలసత్వాలవల్ల మన జనజీవనరీతిని, రివాజును తెలిపే మన సాంస్కృతిక కాణాచి జానపద సాహిత్యం కాలగర్భంలో కలిసిపోయింది. కేవలం వాగ్రూపమైనది పోగా, లిఖితమైన పదసాహిత్యం వాగ్గేయకారులవల్ల మనకు లభ్యమైంది. ఈ దిశలో మనకు వారసత్వంగా దొరికిన పదసాహిత్యం మొట్టమొదటిది తాళ్ళపాక అన్నమాచార్యుల పద సాహిత్యమే.

అన్నమాచార్యులు పదసాహిత్యానికి శ్రీకారం చుట్టి వేలకొలది పదాలు రచించి, పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ ప్రసిద్ధికెక్కారు. అలమేల్మంగా శ్రీ వేంకటేశ్వరుల అలౌకిక శృంగారంతో శృంగార సంకీర్తనలను ఆధ్యాత్మికచింతనా పరతంత్రంతో ఆధ్యాత్మిక సంకీర్తనలను- రెండురకాలుగా రచించి ,భక్తి నీతివైరాగ్యాది వేదాంత తత్వప్రబోధంచేస్తూ అందరికీ సులభ రీతిలో పదరచనచేసి తాను తరించి, మనలను తరింపజేశాడు. అలాగే అన్నమయ్య కుమారుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలా చార్యుడు పదసాహిత్యానికి పుష్టిని చేకూర్చారు. ఆ వెనుక క్షేత్రయ్య, సారంగపాణి, రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, త్యాగరాజు ప్రభృతులు పదరచన చేసి తెలుగులో పదకవితకు పుష్టిని, తుష్టిని చేకూర్చారు. ఈ పదాలను రాగతాళాలతో, అభినయపూర్వకంగా పాడి, ఆడి ప్రదర్శించినప్పుడు విషయావగాహనతో పాటు ఆనందమెంతగానో జనసందోహానికి సమకూరుతూ వచ్చింది.

అలాంటి పదకవితల ప్రథమాచార్యుడైన అన్నమాచార్యుల పద సాహిత్య వైభవంతోపాటు, ఆయన సంకీర్తన సౌరభాన్ని గుభాళిస్తున్న వ్యాస సంపుటి నాయీ 'అన్నమాచార్య సంకీర్తన సౌరభం' అనే గ్రంథం. పద సాహిత్య సంబంధి అయిన నా అనేక గ్రంథాలు ఇంతకుముందే ప్రకటించడం

జరిగింది. ప్రత్యేకించి అన్నమాచార్యుల సంకీర్తనల విశ్లేషణాత్మక విమర్శక గ్రంథాలు- 'అన్నమాచార్య సంకీర్తన సుధ', 'అన్నమాచార్య ప్రముఖ వాగ్గేయకారులు - తులనాత్మక అధ్యయనం' - అనేవి సహృదయ సాహితీ లోకాన్ని అలరించిన అంశం సువిదితమే.

అన్నమాచార్యుల వివిధ సాహితీ చర్చాగోష్ఠుల్లో నేను సమర్పించిన పలు పరిశోధన పత్రాలలో కొన్నిటి సంపుటీకరణమే ఈ "అన్నమాచార్య సంకీర్తన సౌరభం". ఇందులో పదకొండు వ్యాసాలున్నాయి. పదకవితావిర్భావ వికాసాలు, పదకవిత ప్రత్యేకతతోపాటు పదకవిత విస్తరిల్లిన రీతిని మొదటి మూడు వ్యాసాలు వివరిస్తాయి. అన్నమాచార్య సంకీర్తనల్లో కవిగా ఆయన ప్రతిభాపాటవం, అన్నమాచార్యుల ఆధ్యాత్మిక చింతన, ఆనాడే అన్నమాచార్యులకున్న సామాజిక స్పృహ అనే అంశాలు తరువాతి మూడువ్యాసాల్లో స్పష్టమవుతాయి. అన్నమాచార్యుల ఆధ్యాత్మిక చింతన అనే వ్యాసంలో అన్నమాచార్యుల సంకీర్తనలు ఆంధ్రవేదమైన తీరు, అన్నమాచార్యులు భగవద్గీతను తేటతెనుగు మాటల్లో సంకీర్తనలుగా అనువదించిన విధానమూ విదితమవుతాయి.

అన్నమాచార్య పదకవితా లక్ష్యలక్షణ సమన్వయమూ, అన్నమాచార్య సంకీర్తనల్లో స్పష్టమయ్యే జానపద కళారూపాల వివరణ ఆ వెనుకటి రెండు వ్యాసాల్లో స్పష్టం చేయడం జరిగింది. తరువాతి రెండువ్యాసాలు తులనాత్మక పరిశీలనకు సంబంధించినవి. ఇతర వాగ్గేయకారులపై అన్నమయ్య ప్రభావం ఎంతవరకూ ప్రసరించిందో తెలిపి, అన్నమయ్య, క్షేత్రయ్యల పదకవితల్లోని సామ్యభేదాలను వివరించడం జరిగింది. చివరి వ్యాసం అన్నమాచార్య సంకీర్తన సాహిత్యతత్త్వం. ఇందులో అన్నమాచార్యులు తన సంకీర్తనల్లో పొందుపరచిన వివిధాంశాలను వెలికితీసి వివరించిన తీరు స్పష్టం. ఇది పై వ్యాసాలన్నింటికీ, ఆ వ్యాసాల్లో వివరించిన సంకీర్తన వైశిష్ట్యానికి సమీక్ష లాంటిది; ముగింపు లాంటిది. అన్నమాచార్య సంకీర్తన సౌరభం గుభాళించి, సహృదయులైన పండితపామరులను సమానంగా పరవశింపజేసే తీరును సుస్పష్టం చేయడం ఈ వ్యాస సంపుటి పరమప్రయోజనం !

నేను సందర్భోచితంగా రచించిన ఈ పరిశోధన వ్యాసాల కూర్పులో సాధ్యమైనంతవరకు పునరుక్తిని తొలగించడానికి ప్రయత్నించాను.

నాయీ గ్రంథాన్ని సైతం తదితర గ్రంథాల్లాగానే సహృదయ పాఠక లోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాను!

ఈ వ్యాసరచనకు ప్రోత్సహించిన సాహిత్య సంస్థలకు, ప్రత్యేకించి తిరుమల తిరుపతి దేవస్థానం అన్నమాచార్య ప్రాకెక్టు అధిపతులకు నాహృదయ పూర్వక కృతజ్ఞతలు !

ఈ విధంగా గ్రథరూపం ధరించడానికి ఆర్థికసాహాయ్యం గావించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణ మండలికి నా కృతజ్ఞతలు !

శుద్ధప్రతి సిద్ధం చేయడంలో, ప్రూఫులు దిద్దడంలో సహకరించిన మా అల్లుడు డా॥ గుమ్మా సాంబశివరావుకు నా ఆశీస్సులు !

ముద్రణలో నా కన్నివిధాలా సహకరిస్తూ మునుపటిలాగానే ఈ గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించి ఇచ్చిన శ్రీ లక్ష్మీగణపతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత మిత్రులు శ్రీ బి.వి.ఎస్. శాస్త్రి గారికి, వారిసిబ్బందికీ అభినందనలు!

సుధర్మ
6-6-02

—ఆచార్య ఎస్. గంగప్ప

# PREFACE

My continuous and untiring research on Tallapaka Annamacharya's Sankirthanas is the fruit of this work "Annamacharya Sankirthana Sourabham." In this work, there are eleven research papers prepared for presenting to the Nationa Seminars conducted by Annamacharya Project, T.T.D., Tirupati and other literary agencies.

One will enjoy the fragrance and sweetness of Sankirthanas of Annamacharya by going through these articles. Origin Development and Speciality of Padasahity in Telugu can be understood and on this basis, how Annamacharya became famous as 'Pada Kavitha Pithamaha and Sankirthanacharya' by composing 32 thounsand Sankirthanas, set to music, both Sringara and Adhyatmika Sankirthanas with a 'Makuta' of Sri Venkateswara in each Sankirthana. The fragrance of Sankirtanas of Annamacharya in its hieghts and depths, has been analysed critically with illustrations by citing the appropriate Sankirthana where ever necessary.

I hope and feel that this monograph will certainly be well received by the readers interested in Annamacharya like my other works on Annamacharya.

In this context, my thanks are due to the authorities of Tirumala Tirupathi Devastanams, Tirupathi for helping me to bring out this work through their Financial Assistance.

'Sudharma'

6-6-2002

**Prof. S. GANGAPPA**

# అంకితం



కోరిన కోర్కెలను దీర్చే ఏడుకొండలలో వెలసిన
## శ్రీ వేంకటేశ్వర స్వామి పాదపద్మాలకు
అనుపమ భక్తి పురస్సరంగా "అన్నమాచార్య సంకీర్తన సౌరభం"
- సమర్పితం -

కోరి నిను గొల్తు కోనేటిరాయ
నేరనివాడని నిందించకుము ॥పల్లవి॥

వడ్డికాసులతో వరములిచ్చేటి
చెడ్డవారలను శిక్షించునట్టి
గుడ్డివారలకు కుంటివారలకు
సడ్డలేని చూపు సరినడకిచ్చిన ॥కోరి॥

అన్నమయ్య నిల అనుగ్రహించితి
నన్ను నట్లనే నరహరీ చూడు
మన్నన పొందగ మరిభక్తి నొసగు
కన్నయ్యవు గదా కరుణాహృదయా ॥కోరి॥

అన్నమయ్య భక్తి అనుపమ పదాల
విన్నపముచేయ విమర్శచేసితి
ఎన్నగ నొసగితి ఈ సౌరభమ్ము
పన్నగశయన గొను పరమప్రీతిని ॥కోరి॥

—ఆచార్య ఎస్. గంగప్ప

# 1. పదకవిత - ఆవిర్భావ వికాసాలు

పదమంటే పాట. పాడుకోటానికుపకరించేది. పదపద్యకవితల్లో- విశ్వ సాహిత్యంలోనే- పదమే ముందావిర్భవించింది. మానవుడు అతి ప్రాచీన కాలంలో మాట నేర్చిన వెంటనే తనలోని ఆవేశకావేశాలను, భావోద్రేక అర్ద్రితలను, భక్తిప్రేమలను, వలపుతలపులను అభివ్యక్తీకరించటానికి పాట నేర్చుకొన్నాడు. పాటతోపాటు ఆట నేర్చుకొన్నాడు. మాట—పాట—ఆట— క్రమంగా మానవుని వ్యక్తిత్వాన్ని పెంచాయి. అయితే ఆ పాటలు మౌఖికమే (oral). తరువాతికాలంలో పాండిత్య ప్రకర్ష పెరిగాక పద్యమై పండితులకు పరిమితమైంది. ఇది లిఖిత (Written) సాహిత్యం. మౌఖికమైన జానపద సాహిత్యం అనాది; అది అన్ని సాహిత్యాలకు పునాది. లిఖిత సాహిత్యరీతి ననుసరించి అనిబద్ధమైన జానపదమే తరువాతికాలంలో నిబద్ధీకరించబడి పద కవిత్వమైంది. ఇది మన తెలుగుకు మాత్రమే పరిమితం కాదు. అన్ని ప్రపంచ సాహిత్యాలకు వర్తించే లక్షణం.

ప్రపంచ భాషలన్నిటిలోను పదకవిత, పద్యకవిత అని రెండువిధాలు. పాడుకోటానికి ఉపయోగించేది పదం. పద్యం పండితులకు మాత్రమే పరిమితమైంది. మనదేశంలో ఆర్యభాషలు, ద్రావిడ భాషలు అని రెండు రకాలు. సంస్కృతమూ, తదపభ్రంశమైన ప్రాకృతభాషలు ఆర్యభాషలు. అవే ఆయా ఔత్తరాహ భాషలుగా పరిణతి చెందాయి. ముఖ్యంగా దక్షిణదేశంలో తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం ప్రముఖ ద్రావిడభాషలు. వీటిలో ముఖ్యంగా తమిళం చాలవరకు ప్రారంభదశలో పదకవితగానే గుర్తించ బడింది. వాస్తవానికి తెలుగు కన్నడ భాషలపై సంస్కృతం తన పెత్తనం నెరపింది. కానీ తమిళం తత్ప్రభావానికి లోనుకాలేదు సరికదా సంస్కృతాన్ని సైతం తనలోనే ఇముడ్చుకొని తనదైన స్వతంత్ర ప్రతిపత్తిని నిలబెట్టు కొన్నది.

ఇంతకు ప్రప్రథమంగా మనం గుర్తించవలసిన ప్రధానాంశం ఒకటుంది. మనదేశంలో సాహిత్యం మార్గదేశి అని ద్వివిధం. ఆయా ప్రాంతాల్లో ఆయా పామర ప్రజలచేత వాడబడి పాడబడుతూ పరివ్యాప్తమైంది దేశి. లక్షణబద్ధమై పండితైక పరమైంది మార్గ. ఈ మార్గదేశి విభాగం మొదట సంగీతపరంగానూ ఆ వెనుక నృత్యపరంగానూ, ఆ తర్వాత సాహిత్యపరంగానూ నిరూపించ

బడింది. బహుశః "సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్
ఏకమాపాతమధురం అన్యదాలోచనామృతమ్"— అనే శ్లోకమే ఈ సంగీత సాహిత్యాలకున్న సంబంధాన్ని స్పష్టం చేస్తూండటం కూడా ఒక కారణమై ఉండవచ్చు. అంటే సామాన్యప్రజానీకంలో ప్రచారంలో ఉన్న సంగీతం లక్షణబద్ధమైనట్లే, సాహిత్యం సైతం లక్షణబద్ధమై మార్గ అయింది. ఈ మార్గ దేశీవిభాగాన్ని సంగీత దర్పణమూ, సంగీత రత్నాకరమూ నిరూపిస్తున్నాయి. ఈ విభాగం దశరూపకంలో నృత్యపరంగా చెప్పబడింది. దీనివలన తేలిన సారాంశం." "నియమబద్ధమై, శిష్టసమ్మతమును, శాస్త్ర సమ్మతమును అయి ఉత్తమఫణితిని రచింపబడినది మార్గ కవిత. నియమ రహితమై శాస్త్రమున కెక్కక కేవల ప్రజారంజకమునకై రచింపబడినది దేశీ కవిత."[1] దీన్నే మనం పద్య కవిత్వానికీ, పద కవిత్వానికీ సమన్వయించు కోవచ్చు. పైపెచ్చు పూర్వోక్తమైనట్లు ఇది తమిళం కంటే తెలుగు కన్నడ పదకవితలకూ, అటు ఔత్తరాహ సాహిత్యాల్లోని పదకవితలకు సమంగా సరిపోతుంది.

సమస్త సాహిత్యాల్లోను పద్యంకంటే పదమే ముందు ఆవిర్భవించిం దన్న విషయం సర్వ పండితాంగీకృతం. అంతేగాక పదకవితనుంచే పద్య కవిత్వ ముద్భవించిందనీ, పదమే ప్రాచీనమనీ రచితమైన రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి అభిప్రాయం సముచితమైంది. "మనదేశంలో చాలా ప్రాత పాటలు వేదసూక్తములు. మనుష్యజాతికి అవి మొదటి రచనలు అని యూహింపవలసినవి. వాటి గానమంతు తాళము లేదు, అన్నది మనమిక్కడ గమనింపవలసిన తత్వము. రాగతాళములు రెంటిని కలిపి హృదయంగమము లైన భావములను నెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణస్వరూపము. దాని పరిపూర్ణానుభవమును మనకప్పుడే. సతాళముగనో వితాళముగనో కావ్యకళారసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాటరూపము ననే అనుభవించి రసించినదని పండితులూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు.[2]

కాబట్టి పద పద్య కవితల్లో పద కవిత్వమే ముందావిర్భవించింది. ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతులను పొందినప్పుడు, తదను గుణంగా ఆడిపాడుకోవడంలోనే ఈ పదకవిత పుట్టింది. అదే కాలాంతరంలో సంస్కరించబడి మరోవిధంగా పద్యకావ్యంగా, ప్రౌఢకావ్యంగా, పండిత

కావ్యంగా అంగీకరించబడి గౌరవపాత్రమైంది. పదకవిత పండితామోద ముద్ర నెంతమాత్రమూ పొందకపోయినా విద్వద్గోష్ఠులలో ప్రస్తావించబడక పోయినా, రాజగౌరవం సంపాదించకపోయినా దాని దారిన అది నడుస్తూనే ఉంది. అభివృద్ధి చెందుతూనే ఉంది. సామాన్య ప్రజల మన్ననలకు పాత్ర మవుతూనే వచ్చింది. చివరికి రాజగౌరవం పొందడమే గాదు పండితాదరణకు పాత్రమైంది. ఈ పదకవితావిర్భావాన్ని గూర్చి మౌల్టన్ పండితుడు వెలి బుచ్చిన అభిప్రాయాలూ సహజమూ, సర్వసమాదరణీయమూ.

"The improvised lyrical song, communal or individual, popular or artistic is probably the simplest and most spontanious form of lyrical expression........ The true song is primarily the instinctive outburst of emotion or emotional thought in language which by aptness of word and rythm echoes suggests the underlying emotion by melody of time and harmony of stanja is adapted to such modulations of singiag voice as naturally distinguish emotional utterance.... The song is, therefore more than any other lyrical kind, a musical cry."[3]

"That the popular or traditional ballad is folk poetry i.e. Poetry that has originated usually oral form among a homogeneous, non literary people, and has been handed down among them by word of mouth, is generally concered."[4]

అదేవిధంగా తెలుగులోను పదమే ప్రప్రథమంగా పుట్టింది. నన్నయ్యకు ముందు ఎంతో దేశికవిత అనబడే జానపద కవిత ఉండి ఉంటుంది. అది లిఖితం కాక కేవలం మౌఖికం (Oral) గా ఉండి ఒక నోటినుంచి మరో నోటికి, ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి పోయి ఎన్నో మార్పులకు చేర్పులకు లోనై ఎంతో కాలగర్భంలో కలసిపోయింది. ఇది తెలుగుజాతికే దురదృష్టం. తమిళంలో ప్రాచీన కవిత అంటే లిఖితమైన ఈ పదకవితలే. దేశీ అయిన తెలుగు కవిత నాలుగు విధాలనీ, అందులో మధురకవితా రీతిలో చేరినది పదకవిత అనీ లాక్షణికోక్తి. "తెల్గు కవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱగుల గలదని లాక్షణికులనిరి....అందు మధుర కవిత యనగా పాటలు మొదలైనవి. లక్షణదీపికలో నీ విషయమిట్లు చెప్పబడినది. మధుర కవిత్వం బన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యాది

దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్లొట్లు, గీత ప్రబంధములు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, త్యాగఘోష, చతురతర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, నుయ్యాల జోలలు, జక్కులరేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్ట పదాష్ట పదులు నివి యాదిగా గల్గునవి."[5]

పదనిర్వచనం : "పదం" అంటే సామాన్యార్థంలో పాటఅనేవాడుక. రాగతాళ సహితమై ఉండవచ్చు. లేదా కేవలం స్వరరహితమూ కావచ్చు. ఇది జానపదుల సాహిత్యంలో స్పష్టంగా తెలుస్తుంది. కోలాటం, దంపుళ్ళ పాటల్లో రాగంతోపాటు తాళముంటుంది. విసర్రాయి, కపిల పాటల్లో రాగమేగాని తాళానికి అవకాశం ఉండదు. అయితే రెండింట 'లయ' ఉండి తీరుతుంది. 'పదం' పాడమన్నది జన వ్యవహారం.

స్వరతాళ పదాత్మకమైంది గాంధర్వమనీ, స్వరతాళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది పదమనీ, ఈ పదం నిబద్ధం, అని బద్ధం అని రెండు విధాలనీ అవి అతాలము, సతాలము నని రెండు విధాలనీ భరతుని నిర్వచనం. "నియతాక్షర సంబంధము కలిగి ఛందో యతి సమన్వితమై తాలపాతములతోకూడిన పదము నిబద్ధమనబడును. యతి పాద నియమము లేనిదియును, అనియతాక్షరమును అగు పదము అనిబద్ధ మనబడును.[6]

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధి పొందిన తాళ్ళపాక అన్నమాచార్యుడు సంస్కృతంలో 'సంకీర్తన లక్షణం' రచించాడు. అది ప్రస్తుతం అలభ్యం. కానీ అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు దానిని తెలుగులోకి పద్యాత్మకంగా అనువదించాడు. ఆయన చేసిన పద నిర్వచనం భరతాదులు చెప్పిన రీతిలోనే ఉన్నది.

"పదమగు సుప్తి ఙ్గంతము
పదమవయవ, మవయవిమును బదమనఁ బరగున్
దుది నీ తెఱఁగులన్నియుఁ
బదకవితామార్గ సార్వభౌముడు దెలిపెన్"[7]

సంగీతసాహిత్యాలను సమ్మేళనం చేసి పదరచన చేయగల వారిని వాగ్గేయకారులంటారు. వాగ్గేయకార లక్షణం ఇలా చెప్పబడింది.

"వాఙ్మాతు రుచ్యతే గేయం ధాతురిత్యభి ధీయతే
వాచం గేయం చ కురుతే యః స వాగ్గేయ కారః"

–పదమందలి సాహిత్యాంశను "వాక్" అనీ సంగీతాంశను గేయమనీ వ్యవహరించారు. వీటికే ధాతు మాతు సంజ్ఞలున్నాయి. పదంలోని మాతు లేక వాక్కు- సాహిత్యాన్నీ, ధాతు- లేక గేయాన్ని - సంగీతాన్ని రచన చేయగల వాడు వాగ్గేయకారుడు. కవికంటే గూడా ఇతడు ప్రతిభాసంపన్నుడు.

భక్తిభావన భారతీయతత్త్వం. భక్తితోపాటు పదకవిత ప్రారంభమైంది. వేదసూక్తాలు మొదటి పదాలని విజ్ఞులంటారు. సామవేదం గాన యోగ్యమని మనకు తెలుసు. క్రీ॥శ॥ 12వ శతాబ్దిలో వెలసిన జయదేవుని గీతగోవిందం సంస్కృతంలో రచితమైన గేయకావ్యం. నారాయణతీర్థులు సంస్కృతంలో శ్రీకృష్ణ లీలాతరంగిణిని మనోజ్ఞంగా రచించాడు.

అన్నమాచార్యుల తెలుగు సంకీర్తనల్లో దాదాపు వంద సంస్కృత సంకీర్తనలున్నాయి. రామదాసు, త్యాగరాజులలోను కొన్ని సంస్కృతంలో రచించబడిన కీర్తనలు, కృతులున్నాయి.

ఇలాగే ఔత్తరాహ భాషల్లోను పదకవితలు వెలిశాయి. మహారాష్ట్రలో 50 మంది మహాభక్తులుండేవారు. వారిలో ప్రసిద్ధులయిన జ్ఞానదేవ, నామదేవులనే మహాభక్తులు 13, 14 శ. కాలంలో అభంగులనే భావగీతాలు భక్తి పూరితంగా రచించి ఆలపించారు. భక్తతుకారామ్ పేర్కొనదగ్గ మహాభక్తుడు. వీరి అభంగులు సైతం పదాలే. పదకవిత ఇలా విలసిల్లింది.

కృష్ణభక్తికి వంగదేశం ఆటపట్టు. దీనికి మూలవిరాట్టు వల్లభాచార్యుడు. ఈయన ప్రచారం చేసింది శుద్ధాద్వైతం. దీన్నే 'పుష్టి' మార్గమంటారు. వల్లభాచార్యుల తర్వాత చైతన్యస్వామి పేర్కొదగ్గమహనీయుడు. సూరదాసు, చండీదాసు, విద్యాపతి, మీరాబాయి మొదలైన పదకర్తల్ని పేర్కొవడం అవసరం. వీరందరూ కృష్ణభక్తిలో తాము మైమరచి ఇతరులను మైమరచిపోయేలా రచించి గానం చేసిన మహాభక్తులు, పదకర్తలు.

ఔత్తరాహ భాషలకంటే దాక్షిణాత్య భాషల్లో ముఖ్యంగా తమిళంలో మిక్కిలి ప్రాచీనకాలంనుంచి ఈ వైష్ణవ భక్తిపూరిత పదాలు రచితమయ్యాయి. తమిళ దేశంలో శైవ వైష్ణవ మతాలు ప్రాచీనమైనవి. శైవమతాచార్యులు నాయన్మారులు, వైష్ణవ మతాచార్యులు ఆళ్వారులు భక్తిగీతాలు రచించారు. ఈ భక్తిరస గీతాలే తర్వాతి కాలంలో గ్రంథరూపం ధరించాయి. ఇవన్నీ మధురకవితలు. ఆళ్వారుల రచనల్నే నాళాయిరప్రబంధ మంటారు. అంటే నాలుగువేల పదాలు. తమిళంలోని దివ్యప్రబంధాలు తేవారమ్ పదాలుగా దేవాలయాల్లో పరమపవిత్రంగా వాద్యాలతోపాటు కీర్తించబడేవి.

ఇలాగే కన్నడంలోను దాస సాహిత్యం పేర పదసాహిత్యం అనంతం. క్రీ.శ. 13వ శతాబ్దంలో ఉడిపి దగ్గర ద్వైతమతప్రవక్తలైన మధ్వాచార్యులు అవతరించి శైవమతానికి బసవేశ్వరుని లాగా భాగవత ధర్మాన్ని వ్యాప్తిలోనికి తెచ్చారు. ఇతని శిష్యుడు పద్మనాభతీర్థులు. ఇతని శిష్యుడే శ్రీపాదరాయలు, ఇతని శిష్యుడు శ్రీపాదరాయలు. కన్నడంలో 'దేవరనామము' లనబడే కీర్తనలు రచించి పూజాసమయంలో పాడించే పద్ధతిని ప్రారంభించిన ఘనత ఇతనికే దక్కుతుంది. ఈ పదాల్లోని భక్తిశృంగారాదులు శ్రోతల్ని ఆకర్షిస్తూ ఉంటాయి. శ్రీపాదరాయలు ముఖ్యశిష్యుడు వ్యాసరాయస్వామి నూర్లకొలది మనోహర కీర్తనలు రచించి వ్యాసకూటంతోపాటు దాసకూటాన్ని ఉన్నత స్థితికి తెచ్చిన ముఖ్యుడు. వ్యాసరాయల ప్రియశిష్యుల్లో ప్రథమగణ్యుడు పురందరదాసు. వాగ్గేయకార చక్రవర్తి, కర్ణాటక సంగీతానికి తన పద రచనతో చక్కటి బాటలు వేసిన కర్ణాటక సంగీత పితామహుడు. తెలుగులో వేలపదాలు రచించిన అన్నమాచార్యుని సమకాలికుడు. వ్యాసరాయల ప్రియ శిష్యుల్లో మరో ప్రసిద్ధ పదకర్త కనకదాసు. గురువు వ్యాసరాయల చేతనే ప్రశంసలందుకొన్నాడు. ఇంకా గోపాలదాసు, విజయదాసు, జగన్నాథదాసు ప్రభృతులు పదరచనచేసి కన్నడ సాహిత్యంలోని దాససాహిత్యానికే ఎంతో పుష్టిని, తుష్టిని చేకూర్చిన పదకర్తలు. ఇదంతా నేపథ్యం.

ఈ రీతిగా తెలుగులో కూడా పదకవిత ఆవిర్భవించి అనంతంగా వికాసం పొందింది. ఈ పదసాహిత్య అధ్యయనం కోసం సముచిత యుగ విభజనం కూడా అవసరం. ఈ విభజన ద్వారా తెలుగు పదసాహిత్య ప్రారంభ వికాసాలను పరిశీలించడం సులభతరమవుతుంది.

తెలుగులో పదకవిత అనగానే తాళ్ళపాక అన్నమాచార్యులు గుర్తుకు రావలసిందే. అతడు ఈ పదవాఙ్మయానికి చేసిన సేవ అనన్యసామాన్యం. అతని పుత్రపౌత్రులు సైతం ఈ మార్గాన్నే అవలంబించి సుసంపన్నం చేసిన మహానుభావులు. అంటే తాళ్ళపాక కుటుంబమంతా ఈ పదవాఙ్మయానికి సేవ చేసింది. అంతేగాక అన్నమాచార్యులు సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ ఆ నాటికే ప్రసిద్ధి పొందిఉండటం వల్ల ఈ తెలుగు పద సాహిత్యానికంతా మూలవిరాట్టు, తాళ్ళపాక అన్నమాచార్యు డనటంలో విప్రతిపత్తి లేదు. కనుకనే తెలుగు సాహిత్యంలో అతని పేరుమీదుగానే ఒక యుగం వ్యవహరించబడటం చెప్పుకోదగ్గ విషయం. అంతకంటేముందున్న పదకవితనంతా పూర్వయుగంగా మనం పిలవడంలో దోషం లేదు. కాబట్టి ఈ చక్కటి అవగాహనతో తెలుగు పద సాహిత్యాన్ని ఈ విధంగా యుగ విభజన చేయడం సముచితమని నా భావన.

1. అన్నమాచార్య పూర్వయుగం (1400 వరకు)
2. అన్నమాచార్య యుగం (1400-1600)
3. క్షేత్రయ్య యుగం (1600-1750)
4. త్యాగయ్య యుగం (1750-1850)
5. ఆధునిక యుగం (1850 నుంచి....)

—సముచితమైన ఈ యుగవిభజన మూలంగా పదసాహిత్యాన్ని అధ్యయనం చేయడం చాలా సులభతరమవుతుందని చెప్పడంలో ఏ విధమైన సందేహమూ ఉండనక్కరలేదు. పై యుగ విభజన అద్దం పట్టినట్లు వాగ్గేయకారుల తారతమ్యాన్ని స్పష్టీకరిస్తుంది. పైపెచ్చు మరో సౌలభ్యాన్ని సైతం సంపాదించి పెడుతూంది. పదసాహిత్యం అన్నప్పుడు కేవలం పదకవులే కాక పదాలు, దరువులు ప్రాముఖ్యం వహించిన యక్షగానకర్తలు, కాలజ్ఞాన తత్త్వకర్తలు, అద్యతన యుగంలో వెలసిన హరికథా వాగ్గేయకారులు వారివారి కాలానుగుణంగా పై యుగాల్లోనే ప్రస్తావనకు వస్తారు. అంటే ఈ యుగవిభజన నిర్దుష్టమూ, నిర్దిష్టమూనై చక్కటి సమన్వయంతో సముచితమై ఉన్నదని స్పష్టమవుతుంది.

తెలుగు సాహిత్యం క్రీ.శ. 11వ శతాబ్దములో వెలిసింది. అయితే అతఃపూర్వమే దేశిసాహిత్యమనబడే జానపద సాహిత్యం విరివిగా ప్రచారంలో

ఉండే ఉంటుంది. అది పండిత సాహిత్యమైతే ఇది పామర సాహిత్యం. అందుకే తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూ నని లేదా శిష్ట సాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూ నని వింగడించవచ్చు. శిష్టసాహిత్యం కంటే ముందే శిష్టేతర సాహిత్యం ఉద్భవించినా ప్రాచుర్యం పొందినా అది సామాన్య ప్రజలకు మాత్రమే పరిమితమైంది. రాజాదరణ పొందిన శిష్టసాహిత్యం పండితలోకంలో ప్రబలింది. లిఖితమై చాలవరకు నిలిచింది. పామర సాహిత్యం మౌఖికం కావడం వల్ల కాలగర్భంలో ఎంతో కలిసిపోయింది.

తెలుగు సాహిత్యంలోని శిష్టేతర కవితా స్రోతస్విని మూడుపాయలుగా ప్రసిద్ధి వహిస్తూ వచ్చింది. మొదటిది కేవలం జానపద కవిత. దాని పుట్టుక అనాది. లిఖితం కాలేదు. కేవలం మౌఖికం.

రెండోది నన్నయకు పూర్వం శాసనాల్లో అక్కడక్కడా చోటుచేసు కొన్నా పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపద కవిత. దీనికి మళ్ళీ జానపదులలో వ్యాప్తిలో ఉన్న ఏలలు, జోలలు మొదలైన జానపద రూపాలే ఆధారం. ద్విపదను గ్రహించడమే కాదు. పాల్కురికి దీనికి కావ్య ప్రతిపత్తిని కల్పించాడు. అంటే పండితులు సైతం గౌరవించేట్టు పాటుపడ్డాడు. అనాడు పండితలోకంలో సంస్కృతానికే గాని, దేశి అయిన తెలుగుకు ప్రాధాన్యం లేకపోవడం వల్ల దాన్ని ప్రామాణికం చేయడం కోసం—

"తెలుగుమాట లనంగవలదు, వేదముల
కొలదియకా జూడుడిల నెట్టులనిన
బాటితూమునకును బాటి యానేని
బాటింపగా సోలయును బాటికాదె" (బసవ పురాణము పు. 89)

—అనీ పట్టుపట్టి అంగీకరింప జేసినట్లు స్పష్టంగా తెలిసే విషయం. ఇక్కడ ఈ ద్విపద శైవమత ప్రచారం కోసమే ప్రారంభమైనా, ఆ వెనుక తెలుగులో దీనికి పండితాదరణ లభించింది.

మూడోది వైష్ణవమత ప్రాధాన్యంతో అన్నమాచార్యుని (1408–1503) తో ప్రారంభమైన పదకవిత. ఈ పదకవితకు పూర్వం కృష్ణమా చార్యుడు (1268–1323) సింహగిరి వచనాలు రచించి తరించాడు. ఇవి పేరుకు మాత్రమే వచనాలు. కానీ పదంలా పాడుకోడానికి భక్తిప్రపత్తిని

ప్రకటించడానికి ఉపకరించేవే. అయినా అలాంటివే వేంకటేశ్వర వచనాలనే పేరుతో పెదతిరుమలాచార్యుడు తదనంతర కాలంలో రచించటం జరిగింది. అనాదినుంచి పామరప్రజలను అలరిస్తూ వచ్చిన జానపద గేయరీతుల్ని గ్రహించి అనేక పదకవితల్ని శిష్టకవితల్లో ఒక భాగంగా వెలయించి- పండిత ప్రశంసకు పాత్రమైన పద్యకవితా పీఠం ప్రక్కనే పదకవితకు సైతం- సరి పీఠం వేసిన ఘనత అన్నమాచార్యునికే దక్కింది. పూర్వోక్తమైనట్లు- సంస్కృతంలో 'సంకీర్తన లక్షణం' రచించి పదకవితకు విశిష్టతనీ, గౌరవప్రతిపత్తిని కలిగించి, ప్రామాణికతను సంప్రాప్తింప చేశాడు. అంటే దీనికి నిబద్ధతను నిరూపించాడు. ఈ పదాలు శృంగార ఆధ్యాత్మిక పదాలని రెండు విధాలు. యాగంటివారి పదాలు, తత్త్వాలు, వచనాలు వెలిశాయి. అన్నమాచార్యుని పద్ధతిలోనే అతని పుత్రుడు పెదతిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు పదాలు రచించి, పదకవితకు ప్రాముఖ్యాన్ని తెచ్చారు.

సంకీర్తన, పదమూ అని పిలువబడుతూన్న ఈ పదం క్షేత్రయ్యకాలం నాటికి శృంగారపదమనే ప్రసిద్ధికెక్కింది. దీనికి అభినయం జోడించబడింది. ఆనాటినుంచి పదాభినయం ప్రారంభమైంది. రామదాసు కీర్తనలు రచించి భజన పద్ధతిని ప్రవేశపెట్టాడు. సారంగపాణి శృంగారపదాలు, నీతివైరాగ్య సంబంధి అయిన ఆధ్యాత్మిక సంకీర్తనలు రచించాడు. నాదోపాసనలో ముక్తి పొందిన త్యాగరాజు రచనలు కృతులు. సాహిత్యం కంటే సంగీతమే ఇందు ప్రాధాన్యం వహించింది. పోతులూరి వీరబ్రహ్మం, సిద్ధయ్య ప్రభృతులు తత్త్వాలనబడే పదరచన చేశారు. మునిపల్లె సుబ్రహ్మణ్య కవి సైతం సంగీతంలో సాహిత్య ప్రాముఖ్యం గల పదరచన చేశాడు. ఇలాగా ఎందరో మహానుభావులు పదకవిలకి పట్టంగట్టి పరిపోషించి వాగ్గేయకారులుగా ప్రసిద్ధికెక్కారు.

ఆధునిక యుగంలో విజయనగరం మహారాజులైన ఆనందగజపతి మొదలైనవారు పదసాహిత్యాని కెంతో సేవజేశారు. వారి ఆస్థానంలోని దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు ఉత్తమ వాగ్గేయకారుడు. ఈయన అనేక గీతాలు, స్వరజతులు, పదాలు, జావళీలు రచించాడు. అలాగే తచ్చూరి పెదసింగరాచార్యులు, చిన సింగరాచార్యులనే సోదరులు ఉత్తమ వాగ్గేయకారులుగా ప్రసిద్ధి పొందారు. అలాగే తంజావూరులో ఇంకా విద్వాంసులుండేవారు. వీణ శేషణ్ణగారు, తుమరాడ సంగమేశ్వరశాస్త్రి మొదలైనవారు

ఉండేవారు. ఇంకా అనేక యక్షగానకర్తలు, హరికథా వాగ్గేయకారులు ఉండేవారు. హరికథా వాగ్గేయకారులలో శ్రీమదజ్జాడ ఆదిభట్ల ఆదినారాయణ దాసుగారు, కట్టా అచ్చయ్య కవి మొదలైనవారు పేర్కొనదగినవారు. కొందరు తత్త్వకర్తలు కూడా వెలిశారు.

అత్యాధునికుల్లో హరినాగభూషణంగారు సంకీర్తనలు రచించారు. "జయనాట" అనే రాగాన్ని కల్పించారు. అలాగే నల్లాన్ చక్రవర్తుల వెంకట నారాయణాచార్యులు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, జి.ఎన్. బాలసుబ్రహ్మణ్యం గార్లు పేర్కోదగ్గ వాగ్గేయకారులు.

జీవద్వాగ్గేయకారుల్లో బాలాంత్రపు రజనీకాంతరావు, మంగళంపల్లి బాలమురళీకృష్ణ గార్లు ప్రముఖులు. బాలమురళీకృష్ణ 72 మేళకర్త రాగాలలో 'జనకరాజ కృతిమంజరి' అనే గ్రంథాన్ని రచించి ప్రకటించారు. సంస్కృతాంధ్ర భాషల్లోనే గాక తమిళంలోనూ కీర్తనలు రచించి ప్రసిద్ధిగాంచారు. వీరు స్వయంగా సృజించిన రాగం 'మోహనాంగి' రాగం. ఆ రాగంలోని కృతి ఈ విధంగా ఉంది.

ప॥ నీ నామమే నాజీవము - సుధామధురము

అ॥ప॥ నీమేను గానమై - నీమాట గీతమై
వినుతలచి పులకించ - ఫలియించెను జన్మము ॥నీనామమె॥

చ॥ పునీతమై సునాదమై
భువనమెల్ల వినోదమై
జనార్దన మనోహరి
మోహనాంగి రాగిణీ రవళీ
సునీల మురళీకృతి ॥నీనామమె॥

—ఇలా మధుర మంజుల సురభిళమై సాహిత్యాలతో సాగుతుంది కృతి; శ్రీబాలమురళి సుకృతి.

నా యీ ప్రయత్నం అన్నమాచార్యుడు అద్భుతంగా శ్రీ వేంకటేశుని పట్టపురాణి అలిమేలుమంగా దేవికి సమర్పించిన నీరాజనంతో ముగించడం సముచితమని భావిస్తున్నాను.

"క్షీరాబ్ధి కన్యకకు శ్రీ మహాలక్ష్మికిని
నీరజాలయమునకు (యకును) నీరాజనం ॥పల్లవి॥

జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువు మాణిక్యముల నీరాజనం ॥క్షీరా॥

చరణ కిసలయములకు సకియ రంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు నతివ నిజ (నత) నాభికిని
నిరత నానావర్ణ నీరాజనం ॥క్షీరా॥

పగలు శ్రీవేంకటేశు పట్టపురాణియై
నెగడు సతి కళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ చక్కఁదనములకెల్ల
నిగుడు నిజశోభనపు నీరాజనం ॥క్షీరా॥ [26-295]

సూచికలు :

1. లక్ష్మీకాంతం, పింగళి— ఆంధ్రసాహిత్య చరిత్రపుట 28-33.
2. అనంతకృష్ణశర్మ రాళ్ళపల్లి— సాహిత్యోపన్యాసములు-3.
క్షేత్రయ్య పదసాహిత్యము పు. 12, 13.
3. Moulton R.G.— Methods and Meterials of Literary Criticism Pg. 12, 14.
4. ,, ,, — The Modern Study of Litarature- An introduction to literary theory and interpretation- Pg. 605
5. భరతముని— నాట్యశాస్త్రము అధ్యా. 32 శ్లో. 25-47.
6. అప్పారావు— పి.యస్.ఆర్., నాట్యశాస్త్రము అధ్యా-32. పు. 809.
7. చినతిరుమలాచార్యుడు— సంకీర్తన లక్షణము....

# 2. తెలుగులో పదకవిత

"ముదివిటులు విధవలంజలు
పదకవితలు మారుబాస బాపనవారల్
చదువని పండితవర్యులు
కదనాస్థిరవీరవరులు కడిదిపురమునన్"

—ఇది శ్రీనాథుని చాటూక్తిగా ప్రచారంలో ఉంది; ఇది విశ్వాసయోగ్యం కాదు. శ్రీనాథుడు ఒకప్రక్క ఉద్దండ పండిత ప్రశంసాపాత్రమైన శృంగార నైషధాది కృతికర్త అయినట్లే మరోవైపు పామర ప్రజల మన్ననలకు నోచు కొన్న పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథలను రచించిన విషయం పండితు లకే కాదు, పామరులకు సైతం తెలిసిన అంశమే. ప్రారంభంనుంచి మన పండితవర్యులు పదకవితలకు ప్రాధాన్యమివ్వలేదన్న మాటమాత్రం అక్షర సత్యం. చారిత్రక సత్యం. సంస్కృత సమాసభూయిష్ఠమై శబ్దాడంబరముతో గూడినది పండితభాష. సరళమూ, లలితమూ, సులభగ్రాహ్యమూ అయినది పామర భాష. కానీ పండిత భాషకంటే మొదటిదన్న అంశం మనం మరచి పోకూడదు. పామర భాష కాలాంతరంలో సంస్కరించబడి లక్షణబద్ధమై పండిత భాషగా రూపుదిద్దుకొన్న విషయం మనకు విదితమే. ఇదే రీతి కవితావిషయంలోను వర్తిస్తుంది.

ప్రపంచంలోని ఏ సాహిత్యాన్ని పరిశీలించినా పదపద్య కవితల్లో పదమే ముందు పుట్టింది. ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతుల్ని పొందినప్పుడు, అందుకు తగిన రీతిలో ఆడిపాడుకోవడంతోనే ఈ పదకవిత పుట్టింది. ఈ పదకవిత కాలాంతరంలో సంస్కరించబడి పద్యకావ్యంగా, ప్రౌఢకావ్యంగా, పండితకావ్యంగా అంగీకరించబడి గౌరవపాత్రమైంది. పద కవిత పండితామోదం పొందకపోయినా ప్రజాగౌరవానికి పాత్రమైంది.

తెలుగులో సైతం ప్రారంభంలో చక్కటి పదాలుండేవని, పామర ప్రజలు వాటిని పాడుకొంటూ ఆనందించేవాళ్ళని చెప్పవచ్చు. పాల్కురికి సోమనాథుడు "పర్వతపదములు, ఆనంద పదములు, నివాళి, గొబ్బి, వెన్నెల" మొదలైన ఎన్నోరకాల పదాలను పండితారాధ్య చరిత్రలో పేర్కొన్నాడంటే అంతకుముందూ, సమకాలికంగా ఇలాంటి పదకవిత లున్నాయని చెప్పడానికి తగిన ఆధారముంది. నన్నెచోడుని కాలంలో ఊయలపాటలు, గొడు గీతా

లున్నట్లు తెలుస్తుంది. కాబట్టి అంతకుముందే మాత్రాబద్ధమైన అక్కరలు, రగడలు, తరువోజ మొదలైనవీ, పాటలు నన్నయ్యనాడు అంతకుముందు ఉండేవని ఊహించవచ్చు. నాచన సోమనాథుడు రచించిన దనబడే జాజర పాటవల్ల పదకవితలున్నట్లు తెలుస్తుంది.

సంకీర్తనవాఙ్మయం కృష్ణమాచార్యుల సింహగిరి వచనాలతో ప్రారంభ మైంది. ఆ తరువాత పేర్కొదగ్గవి యాగంటివారి వచనాలు, ఆవెనుక వీర బ్రహ్మంగారు, ఆయన శిష్యుడు దూదేకుల సిద్ధయ్యను చెప్పవలసి ఉంది. వీరి తత్త్వాలు ప్రజలకోసం రచితమైనవి.

ఇది ఇలా ఉండగా 15వ శతాబ్దంలో తెలుగు పదకవితకు వసంత కాలం. వేనకువేలు పదాలు రచించిన పదకవితా పితామహుడు అన్నమా చార్యుడు, ఇతని భార్య తిమ్మక్క, పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చినతిరుమలాచార్యుడు ఈ పదరచన చేసి సామాన్య ప్రజానీకాన్ని మెప్పించిన పదకవులు. తిక్కన తరువాత పదాల్లో చక్కటి తేటతెలుగు పదజాలాన్ని, నుడికారాన్ని ప్రయోగించిన మహాకవి అన్నమయ్య. అలాగే ఆవెనుక తేనుగుతేటను, తియ్యదనాన్ని పదాల ద్వారా అందించిన పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఇతనితో సమాన ప్రతిపత్తిగల పదకవి సారంగపాణి. భజన కీర్తనలు రచించి రామదాసు, నాదోపాసనతో ముక్తిపొందిన త్యాగరాజు మొదలైన పదకవులెందరో ఈ తెనుగులో కవితలల్లి సామాన్యప్రజలకు భక్తి, నీతి, వైరాగ్యాలను ప్రబోధించిన మహనీయులు.

తెలుగు సాహిత్య మాగాణంలో శిష్ట, శిష్టేతర కవితలున్నాయి. శిష్ట కవిత పండితమాత్రపరమైంది. శిష్టేతర కవిత మూడు రకాలుగా ఉంది. మొదటిది కేవలం జానపద కవిత. ఇది కేవలం మౌఖికం (oral tradition); రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపద కవిత. ద్విపద కావ్యాలు తెలుగులో ప్రసిద్ధి వహించాయి. మూడోది అన్నమయ్యతో ఆరంభ మైన సంకీర్తన కవిత; ఇదే పదకవిత. జానపద గేయరీతుల్ని శిష్టకవితల్లో ఒక భాగంగా వెలయించి, పద్యకవితా పీఠం ప్రక్కనే పదకవితకు సరిపీఠం వేసిన ఘనత అన్నమయ్యది. ఈ పదకవితా మాధుర్యాన్ని ఆస్వాదించేముందు తెలుగులో అనాది పదకవితలు జానపద గేయాలను గూర్చి తెలుసుకొంటాము. ఈ జానపద గేయాల్లోను రసనిర్భరమైన కవితను పరిశీలిస్తే సామాన్యప్రజలను ఎలా ఆనందోత్సాహాల్లో తేలుస్తూ ఉండేవనే అంశం స్పష్టంగా తెలుస్తుంది.

నేను సేకరించిన జానపద గేయాల్లోగాని కొన్ని భాగాలను ఉదాహరించి వివరిస్తాను. రామాయణ కథకి ఒక ప్రత్యేకత ఉంది. అంతునా జానపద గేయ రామాయణం సర్వజనామోదాన్ని పొందిన అంశం మనకు తెలిసిందే. రాముడితోపాటు సీత అరణ్యానికి వెళుతున్నప్పుడు గేయ రచన ఈ విధంగా సాగింది.

"ఆదేవికదలుతా భూదేవికదిలా
భూదేవికదలుతా భూదేవిపైనున్న రుక్షాలెకదిలా
రుక్షాలపైనున్న పక్షులేకదిలా"

—సీతాదేవి అడవికి వెళ్ళుతూండగా తన పుత్రిక కష్టాన్ని చూచి సహించని తల్లి భూదేవి చలించిందట ! అలాగే చెట్లు, చెట్లమీద పక్షులు చలించి పోయాయట! అంటే ప్రకృతి ప్రకృతిలోని ప్రతిప్రాణీ సీతాదేవి కష్టానికి బాధ పడ్డాయని గేయ కవిహృదయం. ఇది చక్కటి కవితకు మంచి ఉదాహరణ.

ఇలాగే మారీచుడు మాయలేడి రూపంలో వచ్చిన సందర్భంలో రాముడు బాణ ప్రయోగం చేస్తాడు. ఆ మృగం చస్తుంది.

"ఏసేనే రామస్వామి విండమ్ముతోనా
కూలెనే ఆమెకము కుమ్మరామాలా
సోలెనే ఆమెకము సొప్పకట్టలా"

—రాముని అమ్ము దెబ్బతిన్న ఆ జింక 'కుమ్మరమాలా' కూలిపోయిందట! 'సొప్పకట్టలా' సోలిపోయిందట! చక్కటి ఔపమ్యం! సహజసుందరమయిన పదప్రయోగం ! ఈ ఉపమానాలు పామరప్రజల ప్రకృతికి తగిన రీతిగానే ప్రయుక్తం కావడం విశేషం.

ఇలాగే కపిల లేక మోటపాటల్లో మొరటుతనం ఉంటుంది. కానీ సమ్మోహనాస్త్రంలా పనిచేసే కవిత ఉంటుంది.

"కందిరీగ నడుముదానా కాసులోళ్ళ చిన్నదానా
అద్దమంటా నీమొగమూ చూడా ఎద్దులింట పలుగుతగిలో"

—ఇదొక కపిలపాట. ఇందులో నాయిక నుద్దేశించి 'కందిరీగ నడుముదానా' అన్నాడు గేయకవి. ఈ ఉపమానం ఎంత ఔచిత్యంతో కూడిఉందో స్పష్టమవుతుంది. "అస్తి నాస్తి విచికిత్సా హేతుశాతోదరీ" అనీ, "సదసత్సంశయ

గోచరోదరీ"- అని సంస్కృత సమాసయుతంగా పేర్కొన్న శ్రీనాథకవి కంటే పామరకవి గ్రామీణప్రజల అవగాహనకు సముచితరీతిలో స్త్రీ నడుమును 'కందిరీగ నడుము'తో పోల్చడం ఎంతో సహజంగా ఉండడం గమనించగలము. ఏది నిజమైన కవిత్వమో అవగతమవుతుంది. ఈ గేయ కవిత చిరస్థాయిగా నిలుస్తుంది.

ఇలాగే పద్యకవిత్వంకంటే పదకవితలోని సొగసులేమిటో మనం చవి చూడవచ్చు. లలితమూ, సరళమూ అయిన పదజాలంతో అన్నమాచార్యులు సముచితంగా వర్ణించగలడు. బాలకృష్ణుని వర్ణనలో ఈ సారళ్యం గమనించ గలము.

"అతడెవ్వాడు చూపరే అమ్మలాల
ఏతుల నాడేటి కిష్ణుడీతడే కాడుగదా ॥పల్లవి॥

కందువ దేవకిబిడ్డ గనెనట నడురేయి
అంది యశోదకు గొడుకైనాడట
సందడించి పూతకిచండి పాలుదాగేనట
మందల ఆవుల గాచి మలసెనట ॥అత॥

మంచిబండి దన్నెనట మద్దులు విరిచెనట
ఇంచుకంత వేల గొండయెత్తినాడట
మంచుల బిల్లగోవివట్టి మెరసెనట ॥అత॥

—ఇలా సాగుతుంది చక్కటి పదరచన. ఇది అన్నమయ్య శృంగార సంకీర్తన ల్లోనిది. ఇలాగే ఆధ్యాత్మ సంకీర్తనల్లోను విశేషమైన భావపూర్ణరచన గుర్తించ గలము. వైరాగ్య నిరూపణాన్ని వ్యవసాయంతో- నిత్యమూ మనం చూచే అంశాలతో పోల్చిచెప్పిన తీరు ఎంతో మనోజ్ఞం. తేటతెలుగు మాటలతో అందరికీ అర్థమయ్యే రీతిలో తెలిపాడు. ఇందులో రూపకాలంకారముంది.

"పంటల భాగ్యులు వీరు బహు వ్యవసాయులు
అంటిముట్టి యిట్ల గాపాడుదురు ఘనులు ॥పల్లవి॥

పొత్తుల పాపమనేటి పోడునరికివేసి
చిత్తమనియెడు చేనుచేనుగా దున్ని
మత్తిలిశాంతమనే మంచి వానపదనున
విత్తుదురు హరిభక్తివివేకులు ॥పంటలం॥

—ఇలాగా మనం ఎంత తరచిచూచినా ఎంతో మనోజ్ఞంగా లలితపదజాలంతో పదకవిత లల్లిన రీతి విదితమవుతుంది.

తేటతెనుగు మాటల మూటలు క్షేత్రయ్య పదాలు. శృంగారమే ప్రాముఖ్యం వహించినా తెలుగు నుడికారానికి, పలుకుబళ్ళకు ఆ పదాలు నిలయాలు. అందులో కవిత్వానికి లోటుండదు. నాయిక నాయకునితో చెబుతున్న మాటలు.

ఎవ్వతె నిను బోధించెనో ॥పల్లవి॥
ముివ్వగోపాల! నాదు ముచ్చటలెల్ల నీయక
ముదుగు నడిపించుమని ముమ్మాటికి చలపట్టి ॥ఎవ్వతె॥

ఇన్నాళ్ళదాక నీదుచెవి యెరుగనీక
నన్నుగావలసి నీవు నడచితివి
మున్నున్న దయలేక మొగనాలని యెంచక
కన్నుమరుగుగాని చోటుగా చెక్కిలి చీరుమని ॥ఎవ్వతె॥

విరి వాసన కూడిన వితమున నీవునేను
అరమరలేకయుండే యందముచూచి
విరసమెందును లేదు వీరికని తలచి
గురుతుగా నామోవిదమ్మెలు పో నొక్కుమని ॥ఎవ్వతె॥

—ఇలాగా చక్కటి కవితావైభవాన్ని తేటతెలుగు మాటలతో రచించిన పద కవితలు క్షేత్రయ్యలో అనేకమున్నాయి.

సారంగపాణి శృంగారపదాలు, కీర్తనలతోపాటు జాతీయ పదాలు, దేశీయ పదాలని వ్యావహారిక రూపాల్లో పదరచన చేశాడు. చక్కటి తెలుగు పలుకుబళ్ళతో రచన చేయడం సారంగపాణిలోనూ చూడగలం.

దొంగసన్యాసులగూర్చి చక్కటి తెలుగులో సామాన్య ప్రజానీకం కోసం చెప్పిన తీరు గొప్పది.

"జడలు వెనుక జీరాడిన నేమి - జాహ్నవిలోపల మునిగిన నేమి
కడుపుగట్టి నటియించిన నేమి - కాళ్ళపాదుకలు మెట్టిన నేమి
కావివస్త్రములు గట్టిన నేమి - కండ్లుమూసుకొని గొణిగిన నేమి
లావుగ తిరుమణి మెత్తిన నేమి - లక్షతులసి నర్పించిన నేమి

మేనినిండ భస్మమలదిననేమి - మెడల రుద్రాక్షలు పూనిననేమి
నానాభూములు తిరిగిననేమి - నదులు నిధులు గనుగొంటేనేమి"

అనే కీర్తన వేమనను గుర్తుకు తెస్తుంది.

"ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ"

వీరబ్రహ్మేంద్రస్వామి తత్వాలలాంటి రచన, భావమూ సారంగపాణి లోనూ కనిపిస్తాయి.

"అద్దెకొంపవంటిది యీదేహ - మనిత్యమే మనసా ॥పల్లవి॥
మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్ళు సు - మీ వేణుగోపాలునిసాక్షిగ ॥అ.ప॥
బందెగొడ్లవంటిది సంసారము - భ్రమయకే మనసా
యెవరున్న నడమంత్రమే జీవుని - కెవరులేరు మనసా ముమ్మాటికి."

ఇలాంటి ఉదాహరణ లెన్నైనా చూపించవచ్చు.

భజన కీర్తనలు సామూహికంగా ప్రజలు పాడుకోడానికి తగిన రీతిలో భక్తిభావనతో రచించి తరించిన భక్తుడు రామదాసు. భక్తితోపాటు వైరాగ్యాన్ని ప్రబోధించిన మహనీయుడు. తాత్వికదృష్టి రామదాసులోను చూడగలము.

"నరహరి నమ్మక నరులను నమ్మితె
నరజన్మమీడేరునా ఓ మనసా ॥పల్లవి॥
చెరుకులుండగ వెర్రిచెరుకులునమలితె
జిహ్వకు రుచిపుట్టునా ఓ మనసా ॥అ.ప.॥
కాళులుండగ మోకాళ్ళతో నడిచితె
కాశికి పోవచ్చునా ఓ మనసా
నీళ్ళుండగ నుమ్మనీళ్ళను మ్రింగితే
నిండు దాహము తీరునా ఓ మనసా॥"

—ఇలాగా చక్కటి తెలుగులో సామాన్యప్రజల కందరికీ అర్థమయ్యే రీతిలో కీర్తనలు రచించడం వల్లనే రామదాసు కీర్తనలు ప్రజల నాలుకలపైన నర్తిస్తున్నాయి.

త్యాగరాజు భక్తివైరాగ్యాలను ప్రబోధించినా, ఎంతో తన భక్తి భావనను సముచిత రీతిని పాడుకొన్నాడు. శ్రీరాముని తన నోముఫలంగా జీవనాధారంగా చెప్పుకోవడం సముచితంగా ఉంది.

"నాజీవనాధారమా నానోముఫలమా
రాజీవలోచన రాజరాజ శిరోమణి
నాచూపుప్రకాశమా నా నాసికాపరిమళమా
నా జపవర్ణ రూపమా నాదు పూజాసుమమా."

ఇలాగే వైరాగ్యాన్ని ప్రబోధించిన తీరు సమున్నతమైనది. మనలోని అంతశ్శత్రువులను జయించక పైపై బూటకాలవల్ల- అంటే ఆచారాల పేరచేసే పనులవల్ల- ప్రయోజనం లేదంటాడు త్యాగరాజు.

మనసునిల్ప శక్తి లేకపోతే
మధురఘంటసిరుల పూజేమిజేయును ॥మ॥

ఘనదుర్మదుడై తా మునిగితే
కావేరి మందాకిని యెటుబ్రోచును ॥మ॥

సోమిదమ్మ సొగసుగాండ్ర గోరితే
సోమయాజి స్వర్గార్హుడౌనో
కామక్రోధుడు తపంబొనర్చితే
కాచిరక్షించునో త్యాగరాజనుత ॥మ॥

ఇంకా ఎందరో పదకవులు ప్రజాసముదాయాన్ని జాగృతంచేసి సన్మార్గ వర్తనులుగా నడచుకోడానికి తగిన రీతిలో ప్రబోధం చేశారు. వీరందరు ప్రజాకవులు; సమాజక కవులు. ఇలాంటి పదకవితలు పద్యకవితలకంటే ఎంతో ప్రయోజనకారులు. పైగా పద్యకవితల్లో కథా, పాత్రచిత్రణాదులు విశిష్టంగా ఉంటాయి. ఈ పదకవితల్లో అలాంటివేమీ ఉండవు. భక్తి నీతి వైరాగ్యాల్ని బోధించి తద్వారా సమాజ సముద్ధరణ చేయడమే ఈ పదకవుల పరమలక్ష్యం. ఆ లక్ష్యాన్ని పదకవులు సాధించారనడంలో సందేహం లేదు. పద్యకవిత కంటే పదకవితలే ప్రజాసముదాయాని కుపకరించే కవితలని విదిత మవుతుంది.

# 3. పదకవిత ప్రత్యేకత

తెలుగులో పదపద్య కవితల్లో పదకవిత్వానికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. వాస్తవానికిది అన్ని భాషా సాహిత్యాలకీ వర్తించే అంశమని వేరుగా చెప్పనవసరం లేదు.

గురుపద్య విద్యకు నన్నపార్యుడు ప్రథమాచార్యుడు. సహజసుందర మయిన పదకవితా పితామహుడు అన్నమాచార్య సంకీర్తనాచార్యుడు; పద కవిత్వానికి గౌరవ మాపాదించిన మహనీయుడు; అంతకుముందున్నవి సింహ గిరి వచనాలు కేవల వచనాలు; వీటి రచయిత కృష్ణమాచార్యులు. అన్నమా చార్యులతో ఆరంభమైన ఈ పదకవిత మూడుపువ్వు లారుకాయలుగా విలసిల్లింది.

ఇలాంటిపదకవిత్వం పద్యకవిత్వంకంటే ఎలా విభిన్నమైందో, దీని ప్రత్యేక ప్రతిపత్తి ఎలాంటిదో తెలుసుకొనేముందు, దీనిపుట్టుక, విలక్షణత, విశిష్టత గుర్తించవలసి ఉంది. ఈ పదకవితకు మూలం జానపద కవిత. జానపద కవిత జనపదాలలో నివసించే జానపదులకు మాత్రమే పరిమితం. పదకవిత్వం శిష్టులు, భక్తులు, తాత్వికులు అయిన మహనీయులవల్ల ప్రచారంలోకి వచ్చింది. జానపదకవితా ఫణితులే తదనంతరకాలంలో నిబద్ధం చేయబడి పదకవితలుగా రూపుదిద్దుకుంది. జానపద కవిత అనిబద్ధం. పదకవిత నిబద్ధం. అన్నమా చార్యులు అనేక జానపద కవితారీతుల్ని నిబద్ధం చేసి సంకీర్తనాచార్యుడుగా, పదకవితా పితామహుడుగా ప్రసిద్ధికెక్కాడు. ఆవెనుక ఎందరో మహా వాగ్గేయ కారులు వెలిసి, పదకవిత్వాన్ని ప్రచారం చేశారు.

సమస్త సాహిత్యాలకు మూలం పదకవిత. అందునా జానపద కవిత్వం జానపదులు- పామరులు- అనాదిలో ఆడిపాడి ఆనందించిన కవిత; అనాది మాత్రమే కాదు; అదే పునాది. అలాంటి పదకవితను ప్రాక్తన మానవుడు తన ఆవేశకావేశాలకు, కరుణరసార్ద్రితలకు, రసమయ జగత్తున కనుగుణంగా భావోద్రేకాన్ని, భావోద్వేగాన్ని తనకు నచ్చిన తాను మెచ్చిన, తనకు వచ్చిన రీతిలో ఆడిపాడుకొన్నాడు. ఆనందసంతోషాలతోపాటు, కష్టనిష్ఠూరాలను పాడుకొని తన జీవితంతో పాటు పదకవితకు ప్రాణంపోసి, పోషించాడు. అది గాలిలో పుట్టి, గాలిలోనే ఎంతో కలిసిపోయింది. ఇదంతా కేవలం మౌఖికం

(Oral) సంప్రదాయానికి చెందింది. ఎవరూ దీన్ని భద్రపరచలేదు. ఈ ఆధునిక యుగంలో- అలాంటి పదకవిత ఎంతో కాలగర్భంలో కలిసి నశించి పోగా- తక్కింది సేకరించి, పరిరక్షించి, పరిశోధించి ఎంతో విజ్ఞానాన్ని సంపాదించగలగడం విశేషం. ఇలాంటి పదకవితలు పామరులనేగాక పండితుల మెప్పులకు సైతం నోచుకోవడం విశేషం. ఇది ఈనాటి మాట. ఒకనాడు ఈ పదకవితను పండితు లీసడించారు. అందువల్లనే నశించిపోయింది.

ఇలాంటి అనిబద్ధ పదకవితలను నిబద్ధం చేసిన ఘనత మొట్టమొదట తాళ్ళపాక అన్నమాచార్యులకే దక్కింది. జానపదకవితా కర్తలందరు అజ్ఞాతకవులు. పదకవితల రచయితలు జ్ఞాతులు. జానపదకవిత మౌఖికం. ఒక నోటినుంచి మరోనోటికి, ఒకచోటినుంచి మరోచోటికి, ప్రాంతీయమైన మార్పులతో, చేర్పులతో, కూర్పులతో పోయిందిపోగా ప్రచారం పొందింది. కానీ వాగ్రూపమై, నిబద్ధమైన కవిత గ్రంథస్థమైంది. తాళ్ళపాక అన్నమా చార్యులు, ఆయన కుమారుడు పెదతిరుమలాచార్యుడు, ఆయన కుమారుడు చినతిరుమలాచార్యుడు రచించిన పదాలు తాటియాకులుపైనే గాక రాగి రేకులపై లిఖించబడి భద్రపరచపడి ఈనాడు, తిరుమల తిరుపతి దేవస్థానం వల్ల వెలుగుచూశాయి; ప్రచారం పొందాయి. తాళ్ళపాక పదకవులు శృంగార, అధ్యాత్మ సంకీర్తనలని రెండురకాల పదకవిత అల్లారు. ఇందులో భక్తి, తాత్త్వికత, ఆధ్యాత్మికత, సమానత్వం మొదలైన భావసంపన్నమై ఉండడం విశేషం. కేవలం తాత్త్వికచింతనతో పదరచన చేసినవారు "యాగంటివారు". యాగంటివారి తత్త్వాలు ఈనాడు ప్రచారంలో ఉన్నాయి. కేవలం శృంగార పదాలు రచించిన ఘనత క్షేత్రయ్యది. భక్తి, తాత్త్వికత, ఆధ్యాత్మికత, వైరా గ్యాలు సారంగపాణిలో చూడగలము. భక్తినిర్భరమైన భజన కూటములకు అనువైన కీర్తనలు రచించిన పదకవి రామదాసు; ఎడ్ల రామదాసు. భక్తిని తాత్త్వికతను, ఆధ్యాత్మికతను ముప్పేటలా ముచ్చటగా పొదిగి అధ్యాత్మ రామాయణ కీర్తనలను రచించిన మహనీయుడు మునిపల్లె సుబ్రహ్మణ్య కవి. తన తత్త్వాలతో ముంచెత్తినవాడు వీరబ్రహ్మేంద్రస్వామి, ఆయన శిష్యుడు. నాదోపాసనలో ముక్తుడైన మహాయోగి త్యాగరాజు. సంగీత ప్రాబల్యం తగ్గి, సాహిత్యాధిపత్యం నెరపించి అన్నమాచార్య సంకీర్తనల్లో. సంగీతసాహిత్యాలు సమపాళ్ళలో ఉంటూ అభినయం జోడైనది క్షేత్రయ్య పదాల్లో. సంగీతపు సంగతులతో, ప్రస్తారంతో సాహిత్యం వెనుకబడి నడిచాయి త్యాగరాజు

కృతులు. ఈనాడు బాలాంత్రపు రజనీకాంతరావు గారు, మంగళంపల్లి బాల మురళీకృష్ణ వంటి వాగ్గేయకారులలో ఈ పదకవిత పరాంకోటికెక్కింది. పద కవితకు- ముందే చెప్పినట్లు- ప్రత్యేకమైన ప్రతిపత్తి ఉంది.

పదపద్య కవితల్లో పదకవితే ముందు పుట్టిందన్న సిద్ధాంతం రుజువైంది. పద్యకవిత తరువాతిది. తెలుగులోగూడా నన్నయ పద్యరచనా కాలం నాటికి శాసనాల్లో పదకవిత లనబడే తరువోజు, సీసం, మధ్యాక్కర ఉన్నట్లు విదితమే. ఆవెనుకే పద్యకవిత ప్రచారంలోకి వచ్చింది. పదకవితకు రాజాదరణలేదు. పద్యకవితకు రాజాదరణ లభించి వ్యాప్తిలోకి వచ్చింది. వాస్తవానికి ఈ పదకవిత తెలుగులో మూడు రీతులుగా ఉన్నట్లు మనం చూడగలం. జానపద కవిత అనాది. దానికి ప్రజల రసనలే ఆకులు. ద్విపద కవిత పాల్కురికి సోమనాథునితో ప్రారంభం ప్రాచుర్యానికి వచ్చింది. అన్నమాచార్యులతో ఈ పదకవితలు ప్రాముఖ్యానికి వచ్చాయి.

ఈ పదకవులను వాగ్గేయకారు లంటారు. వాక్ + గేయం రెంటిని చేయగలవాడు వాగ్గేయకారుడు. సంగీత సంప్రదాయాలలో వాక్కును మాతు వనీ, గేయాన్ని ధాతువనీ అంటారు.

"వాఙ్మాతురుచ్యతే గేయం ధాతు రిత్యభిధీయతే
వాచం గేయం చ కురుతే యః స వాగ్గేయకారః"

—అని వివరణ. ఈ వాగ్గేయకారుడు కవితో ఏమాత్రం తీసిపోడు. పైపెచ్చు కవికి అబ్బని మరి రెండు లక్షణాలు ప్రత్యేకించి, సంగీతజ్ఞానంతోపాటు అభినయవేత్త అయి- వాగ్గేయకారుడు శ్రేష్ఠుడయి ఉంటాడు. అంటే పద్యానికి ఛందస్సు మూలాన అబ్బిన లయ తూగు ఉంటాయి. కానీ పదకవితలో రాగం తాళం సమ్మిళితమై ప్రజా హృదయాలను రంజింపజేస్తాయి. పండితుల్నే గాదు పామర ప్రజల్ని పరవశింపజేస్తాయి. ఇందులో పాటతోపాటు ఆట ఉంటుంది. మరో విశేషం. ప్రాణికోటిని సైతం మురిపించే, పరవశింపజేసే గుణం ఈ పదకవితల్లో సంగీతం ప్రాముఖ్యం వహిస్తుంది. "పశుర్వేత్తి, శిశుర్వేత్తి, వేత్తిగానరసంఫణీ" అన్న విషయం మనకు తెలిసిందే. ఇంతేగాదు. సంగీత ప్రాముఖ్యం ఇంకా బాగా చిత్రించిన విషయము మనకు తెలుసు.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్ ।
ఏకమాపాత మధురం అన్యదాలోచనామృతమ్ ॥

సంగీతసాహిత్యాలు సరస్వతీదేవి స్తనాలజంట. మొదటిది అందే సంగీతం 'ఆపాతమధురమ్' విన్నవెంటనే ఆనందాపాది కాగా, 'అన్యత్' రెండోదైన సాహిత్యం ఆలోచించినకొలదీ అమృతాయమానమైన ఫలాల్ని అందిస్తుంది. అంటే విన్నవెంటనే ఆపాతమధురమైన సంగీత ప్రాముఖ్యం వల్ల పదకవిత పద్యకవితకంటే ఎన్నో రెట్లు విశిష్టమై, ప్రత్యేక ప్రతిపత్తిని సాధించిందని చెప్పడంలో సందేహం లేదు.

పద్యం పండిత పరమైంది. పద్యకవిత కఠినం. పదకవిత సరళమై అందరికీ అందుబాటులో ఉంటుంది. పదకవిత ప్రజాకవిత. ప్రజలను భక్తి పరులను చేసి, భక్తి నీతి వైరాగ్య ప్రబోధం చేయడం పదకవితా ప్రయోజనం ఇందులోని భాష, భావం, భావ వ్యక్తీకరణ మొదలైనవన్నీ సులభమై ప్రజల కవగాహనకు అత్యంతానుగుణమై ఉంటాయి. కొన్ని ఉదాహరణలను పరిశీలిస్తే ఈ అంశం స్పష్టమవుతుంది. అన్నమాచార్యునిలో కేవలం మధుర మంజులమైన పదరచనకేగాక, భక్తి, నీతి, వైరాగ్య, తాత్వికచింతనాపరంగా ఉన్న ఎన్నో పదాలను చవిచూడవచ్చు. అలమేలుమంగా దివ్యలాస్యాన్ని వర్ణించినతీరు సులభసుందరమై ఒప్పుతుంది.

"అలరులు గురియగ నాడెనదే
అలకల గులుకుల నలమేలుమంగ ॥పల్లవి॥
అరవిరి సొబగుల నతివలు మెచ్చగ
అరతెరమరుగున నాడెనదే
వరుస పూర్వదువాళపు తిరుపుల
హరి గరగింపుచు - నలమేలు మంగ "అలమేలు॥"

(శ్రృం. సం. 12-24)

ఇలాగే మనోజ్ఞమై, భావపూర్ణమై, ప్రతిభాపాటవాలకూ నిదర్శనమీ క్రింది సంకీర్తన.

"అతివ జవ్వనము రాయలకు బెట్టని కోట
పతిమదన సుఖరాజ్య భారంబు నిలుప ॥పల్లవి॥
కాంత కనుచూపు మేఘంబు లోపలి మెఱుగు
కాంతుని మనంబు చీకటి వాపను
ఇంతి చక్కని వదన మిందుబింబము విభుని
వంత కనుదోయి కలువల జొక్కజేయ ॥అతివ॥"

నీతి, వైరాగ్య, తాత్వికతా దృష్టతో చెప్పిన తీరు మనోహరం. అందరినీ ఆకట్టుకొంటుంది.

"ఇన్నియు జదువనేల యింతా వెదకనేల
కన్నుదెరచు టొకటి కనుమూయు టొకటి"

"నానాటి బదుకు నాటకము
కానకకన్నది కైవల్యము ॥పల్లవి॥
పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమి పని నాటకము
యెట్టనెదుటగల దీ ప్రపంచమును
కట్టగడపటిది కైవల్యము ॥నానాటి॥"

పలుకుపలుకున తేనెలొలుక బలికిన క్షేత్రయ్య పదాలు సంగీత సాహిత్య పూర్ణమై అభినయాత్మకమై ఒప్పుతాయి.

మువ్వగోపాలుని సౌందర్య వర్ణన :

"ఎంత చక్కనివాడే! నాసామి వీడెంత చక్కనివాడే! ॥పల్లవి॥
ఇంతి మువ్వగోపాలుడు సంతతము నామదికి
సంతోషము చేసునే ॥అను ప.॥
మొలక నవ్వులవాడె ముద్దుమాటలవాడే
తళుకారు చెక్కుటద్దములవాడే
తలిరాకు జిగి తెగడ దగు మోము గలవాడే
తెలితమ్మిరేకు కన్నుల నమరువాడే ॥ఎంత॥"

వరదరాజస్వామి ఆలయంలో ఆ దేవేరి ఆ దేవుల వేంచేపు చేయించి అర్చకులు వెళ్ళిపోగా రాత్రి అంతా గుడిలోనే ఉండి ఉదయాన ఒక దివ్య స్త్రీ దర్శనం కాగా ఈ పదం పాడుకొన్నాడు క్షేత్రయ్య.

"మగువ తన కేళికా మందిరము వెడలెన్ ॥పల్లవి॥
వగకాడ మాకంచివరద తెల్లవారె ననుచు ॥అ.ప ॥
విడజారు గొజ్జంగి విరిదండ జాడతోను
కడు చిక్కువడి పెనగు కంటసరితోను
నిడుదకన్నుల దేరు నిదురమబ్బుతోను
తొడరి పదయుగమున తడబడెడు నడతోను ॥మగువ॥"

మనోజ్ఞ పదరచనలో క్షేత్రయ్య ప్రతిభా భావుకతలతో పాటు తెలుగు పలుకుల తేటదనం విదితమవుతుందీ పదంలో. ధ్వని, వ్యంగ్యం సైతం స్పష్టం కాకమానవు.

"చాలుచాలు ఈ చిన్నెలతో నాదు సరసకు జేరకుర ॥పల్లవి॥

చాలు ఈ చిన్నెలు సొగవు నావద్ద మువ్వగో
పాల! భామవద్దికేపోర ॥అ.ప.॥

కన్నుల వీడెముతో కాటుక మోవితో
వెన్నున కీల్జడ వేటుతోను
కన్నియ కెంపుల గాజుల నొక్కులతోను
వన్నెకాడ! నుదుటను నున్నలత్తుకతోను ॥చాలా॥"

రామదాసు భజనరీతిలో రచించిన కీర్తనలు సర్వాంధ్రలోనే గాక తెలుగు వెలుగు వెలసిన చోటల్లా వినిపించే భక్తికీర్తనలు. రామభక్తి ప్రతిపాదకమైన కీర్తన.

"రామజోగి మందుకొనరే ఓ జనులారా ॥పల్లవి॥

రామజోగి మందుకొని ప్రేమతో భజియించుడన్న
కామక్రోధలోభమోహ ఘనమైన రోగాలకు మందు ॥అ.ప.॥

ఇందు తాత్త్వికతా ప్రాధాన్యముంది. ఇలానే రామదాసు ఆర్తి, మొర ఈక్రింది కీర్తనలో చూడగలం.

"నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లి ॥పల్లవి॥

నను బ్రోవుమని చెప్పవే నారీ శిరోమణి
జనకుని కూతుర జనని జానకమ్మ ॥అ.ప.॥

శ్రీరామచంద్రుని కల్యాణరూపవర్ణన :

"తళుకు తళుకున ముద్దుకులుకు జిగి
కుందనపు నిలువుటంగీ తొడిగి...."

సారంగపాణి పదాల్లో భక్తిప్రాధాన్యాన్ని ప్రవచించిన తీరు సామాన్య జనసందోహానికి అర్థమయ్యే రీతిలో రచితం.

"భక్తిలేని పూజలేమిటికి పత్రిదారకగానే
భక్తిలేని పూజలేమిటికి ॥పల్లవి॥

భక్తిలేని పూజలేమిటికి
భాషించని మగడేమిటికి ॥అ.ప.॥

రక్తిపొడని పదమేమిటికి
రహిని వేణుగోపాలుని పాద ॥భక్తి॥

వేణుగోపాలస్వామి రథోత్సవ వర్ణన మనోహరం.

"కదలివచ్చెను జూడరే వేణు
గోపాలుడు కనులపండుగ గాను ॥పల్లవి॥
పదిలుడై గరుడునిపై నెక్కి భక్తుల
ముదమంద జేయుచు ఇదిగో రాజమార్గమున ॥అ.ప.॥
సురలు నుతింపగ వేదము లవనీసురులు పఠింపగను
ధరణీప లతిభక్తితను సేవింపగాను
సరసీజాక్షులు నాట్యసరణి నభియింపగాను ॥కదలి॥

తాత్వికతా ధోరణిలో చెప్పిన నీతి వైరాగ్యపూరితమై ఉంది ఈక్రింది పదం :

"అద్దెకొంపవంటిది యీ దేహ
మనిత్యమే మనసా ॥పల్లవి॥
మిద్దెమీది పరుగులు రెణ్ణాళ్ళ సు
మీ వేణుగోపాలుని సాక్షిగ ॥అ.ప.॥"

తత్వాలు రచించినవారిలో యాగంటివారు మొదటివారు.

"ఆనందమయుడు గావలెను
మనసుపదిలము చేయవలెను, ఈ
తనువులోపలి తెలివితోనే కనవలెను
కనుచూపులొకటి కావలెను, అందు
ఘన చిదానంద లింగము గానవలెను"

పోతులూరి వీరబ్రహ్మంగారి తత్వాలు చాలా ప్రసిద్ధమే. సామాన్య ప్రజలలోఆయనకున్నంత ప్రచార ప్రాముఖ్యాల గూర్చి చెప్పనవసరంలేదు. కొన్ని ఉదాహరణలు :

"చెప్పలేదంటనకపోయేరు, నరులార గురుని
చేరి మొక్కితె బ్రతక నేర్చేరు."
"ఇల్లువాకిలి నాది ఇల్లాలు నాదనుచు
యేల బ్రమసితివయ్యో మనసా."
"చిల్లరరాళ్ళకు మొక్కుచునుండే
చిత్తము చెడిపో నారెవారే."

ఇలాగే వీరబ్రహ్మంగారి శిష్యుడు దూదేకుల సిద్ధయ్య తత్వాలనేకం. ఒక ఉదాహరణ.

"ఏ కులమని వివరమడిగితే - యేమని తెలుపుదు లోకులకూ,
పలుగాకులకూ, దుర్మార్గులకూ, యీ దుష్టులకూ॥"

నాదోపాసనలో శ్రీరామునే స్మరించి తరించిన మహా వాగ్గేయకారుడు త్యాగరాజు. ఎన్నైనా ఉదాహరించవచ్చు.

వర్ణనకు : "అలక లల్లాడగ గని ఆరాణ్ముని ఎటు పొంగెనో."
భావచిత్రరచనకు : "సొగసుచూడ( దరమా నీ
నిగనిగమనుచు( గపోలయుగముచే మెరయు మోము."
శబ్దాలంకారాల్లో వృత్త్యానుప్రాసకు : "వందనము రఘునందన సేతు
బంధన భక్తచందన రామ"
ఉపమాలంకారానికి : "తెరతీయగరాదా లోని ॥పల్లవి॥
తిరుపతి వేంకటరమణ మచ్చరమును ॥అ.ప."

ఇలా ఎన్నో ఉదాహరణలు చూపింప వీలవుతుంది.

చివర కీనాడు గూడా ప్రసిద్ధ వాగ్గేయకారుడైన మంగళంపల్లి బాల మురళిలోనూ ఈ పదరచనా వైవిధ్యం చూడవచ్చు. స్వయంగా సృజించిన మోహనాంగి రాగంలోని కృతి : రూపకతాళం :

"నీనామమె నా జీవనము, సుధామధురము ॥పల్లవి॥
నీమేను గానమై - నీమాట గీతమై
నిను తలచి పులకించ - ఫలియించెను జన్మము ॥అ.ప.॥
పునీతమై సునాదమై - భువనమెల్ల వినోదమై
జనార్దన మనోహరి మో - హనాంగి రాగిణీరవళి
మునీల మురళీకృతి ॥నీనామమె॥

పదకవుల రచనా వైవిధ్యం మనం పరిశీలించాము పై ఉదాహరణల మూలాన. పద్యవిద్య మనకు సుపరిచితమే. పద్యం పాండిత్య ప్రదర్శనకు, శాస్త్రవిజ్ఞానానికి నిదర్శనమే గావచ్చు. కానీ పదకవిత్వం పామరులు మొదలు పండితులుదాకా ఆనందించేదని మనకు తెలుస్తుంది. పై ఉదాహరణ లన్నింటిలోను అర్థకాఠిన్యంగానీ, దూరాన్వయంగానీ, సమన్వయ సంపాదనలో లోపంగానీ లేవని గుర్తించగలిగాము. ఇంతెందుకు ? పద్యకవితకు, పద కవితకూమూలమైన జానపదకవితనుపరిశీలిస్తే ఈవిషయం స్పష్టంకాకమానదు. జానపద గేయకవితలో "కందిరీగ నడుముదానా - కానులోళ్ళ చిన్నదానా" అన్నప్పుడు- స్త్రీల నడుము సింహమధ్యమనీ, లేదనీ, నభమని "సదసత్సం శయ గోచరోదరీ" అనీ, "అస్తి నాస్తి విచికిత్సా హేతుశాతోదరి" అనీ చెప్పి నప్పటికంటే ఎంత సహజసుందరమూ, మనోజ్ఞమూ అయి ఒప్పుతూందో స్పష్టమవుతుంది కదా. అలాగే క్షేత్రయ్య నాయిక నాయకునితో చెబుతూ ఉంది. నీవింతలో రాకపోతే "కన్నీరు కావేరి కాలువ సుమా"అనీ అంటుంది. ఇంతకంటే కరుణరస పరిప్లావితంగా సాగే జానపదగేయాల్లో- ప్రత్యేకించి కపిలి పాటల్లో (మోట)- ఒక పాటను గమనించండి- నాయిక ప్రియుని కోసం వెదుకుతూ సంకేతం ప్రకారం నీళ్ళరేవుకి వచ్చింది. అక్కడ ప్రియుడు కనిపించలేదు. కంటినీరే కడవ నిండిందట !

"నీళ్ళకంటా నేనువస్తి నిన్నుజూడ వస్తిగదరా
నీళ్ళరేవుతో నీవులేవూ కంటినీరే కడవనిండో"

ఇంతకంటే గొప్ప కవిత్వం, 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనీ, 'రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్,' అనే రససూత్రాలకి ఒదిగే కవిత్వం మరొకటుందా? సహృదయ హృదయాలే గ్రహించగలవు ! అది పదకవితా ప్రత్యేకత!

# 4. అన్నమాచార్య సంకీర్తనలలో - ప్రతిభా పాటవం

కవిశబ్దవాచ్యునకు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసాలు అత్యంతావశ్యకం. పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ ప్రసిద్ధిపొంది తనసంకీర్తనల్లో ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసాలతోపాటు సంగీతాభినయాది, శృంగార, ఆధ్యాత్మికాది విశేషాంశాలతో ఉత్తమ భాగవతుడుగా నిరూపించుకొంటూనే, తెలుగులో అత్యుత్తమ, ప్రప్రథమ వాగ్గేయకారుడై పరిఢవిల్లాడు తాళ్ళపాక అన్నమాచార్యులు.

అన్నమాచార్యులు 1408లో జన్మించి ఈనాటికి 590 వసంతాలు గడిచాయి. ఇది ఆ మహనీయుని 590వ జయంతి మహోత్సవం. ఇలా ఆ మహాపురుషుని జయంతి జరుపుకోవడం మన అదృష్టం; ఆంధ్రులందరి అదృష్టం.

మహాభక్తాగ్రేసరులు పన్నిద్దరాళ్వారులనుంచీ, శ్రీ రామానుజాచార్యుల నుంచి శ్రీకృష్ణ భక్తితత్వాన్ని, విశిష్టాద్వైతమతప్రాశస్త్యాన్ని అందిపుచ్చుకొని, జానపదులనుంచి, శ్రీ జయదేవునినుంచి గీతిరీతిని సంగ్రహించి తెలుగులో 32వేల సంకీర్తనలు శ్రీ వేంకటేశ్వరునిపై రచించి, ఆడిపాడి తరించిన ఆ మహావాగ్గేయకారుడు ఉత్తమకవి ఆ మహాకవితా వైభవానికి ప్రతీక ఆయన సంకీర్తనల్లోని ప్రతిభాపాటవం. కవికి ప్రతిభ స్వభావసిద్ధం; పూర్వజన్మవాసనా విలసితం; వ్యుత్పత్తి బహుగ్రంథ పఠనజన్యమైనది. లోకవృత్త పరిశీలనవల్ల, గురుశుశ్రూషాజనితమైనది జ్ఞానం. అన్నమాచార్యుని సంకీర్తనల్లోని ఆయన ప్రతిభను పరిశీలిద్దాము. అనిబద్ధమైన జానపద గేయరీతుల నెన్నింటినో తనవిగా చేసుకొని నిబద్ధపదరచనచేసి మహా వాగ్గేయకారుడై అలాగే జయదేవుని అష్టపదుల్లాంటి అనేక సంస్కృత సంకీర్తనలు సైతం రచించడం విశేషం. ఆయన సులభసుందరమైన జానపదులకు సైతం అర్థమయ్యేలా రచించడమేగాక, ఉభయభాషా పాండిత్య ప్రకర్షను ప్రకటించే సంకీర్తన విధానం గమనించగలము.

**సులభశైలి :**

జానపదులలాగా సులభశైలిలో స్వభావోక్తిలో పదరచన చేయడం

అన్నమాచార్యులకు వెన్నతో పెట్టిన విద్య. చక్కటి ఉదాహరణ. నాయిక-అలమేలుమంగాదేవి వర్ణన.

జవ్వాది మెత్తినది తన
జవ్వనమే జన్నె వట్టినది ॥పల్లవి॥
ముద్దుల మాటలది చెక్కు
టద్దముల కాంతినందినది
గద్దరి చూపులది తన
వొద్ది చెలియమీద నొరగున్నది ॥జవ్వా॥
పుత్తడి బోలినది తన
చిత్తము నీసొమ్ము చేసినది
గుత్తపు గుబ్బలది అల
చిత్తజుని లెక్కసేయనిది ॥జవ్వా॥
ఎమ్మెలు ఎరుగనిది తన
నెమ్మోవి జిరునవ్వు గెరలున్నది
కమ్మకొనగ వేంకటరాయా
కమ్మని కౌగిట గలసున్నది ॥జవ్వా॥(శృం.సం. 12-316)

**భావుకతా శోభితమైన రచనా వైవిధ్యం :**

నాయిక అలమేలుమంగాదేవి వర్ణనలో ఔపమ్యపూర్ణమైన పదరచనవల్ల అన్నమాచార్యుల ప్రతిభాపాటవం భావుకత, ఊహాకల్పనాశిల్పవైభవం విదితమవుతాయి.

మూసిన ముత్యానకేలే మొరగులు
ఆసల చిత్తానకేలే అలవోకలు ॥పల్లవి॥
కందులేని మోముకేలే కస్తూరి
చిందు నీకొప్పునకేలే సేమంతులు
మందయానమునకేలే మట్టెలమోత
గందమేలే పైపై కమ్మని నీమేనికి ॥మూసిన॥

భారపు గుబ్బలకేలే పయ్యెద నీ
బీరపు చూపులకేలే పెడమోము
జీరల బుజాలకేలే చెమటలు నీ
గోరంట గోళ్ళకేలే కొనవాండ్లు ॥మూసిన॥

ముద్దులమాటలకేలే ముదములు నీ
యద్దపు చెక్కులకేలే అరవిరి
వొద్దిక మాటలకేలే వూర్పులు నీకు
నద్దమేలే తిరువేంకటాద్రీశుఁగూడి ॥మూసిన॥

(శృం. సం. 12-125)

మూసిన ముత్యం, అసలచిత్తం మొదలైనవి స్వభావసిద్ధమైన నాయికాంశాలకు మరికొన్ని ఇతర విశేషాలు అవసరం లేదని అన్నమాచార్యులు ఎంతో చమత్కారభరితంగా వర్ణించడం, ఆయన్ని కవికుల గురువుగా చెప్పక చెప్పుతుంది.

మరింత పదరచనా వైభవానికి చక్కటి ఉదాహరణ అన్నమాచార్యుల సంకీర్తనల్లో ముఖ్యమైన పదం- ఆయన భావుకత, ఊహాశాలితతో కూడిన ప్రతిభా సంపద మనోజ్ఞమై ఒప్పుతుంది.

ఏమొకో చిగురుటధరమున యెడనెడ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥

కలికి చకోరాక్షికి గడకన్నులు గెంపైతోచిన
చెలువం బిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యా కొనచూపులు
నిలువున పెరుగక నంటిన నెత్తురు కాదుగదా ॥ఏమొకో॥

పడతికి చనుగవ మెరుగులు పైపై బయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలగ వేసవికాలపు వెన్నెల కాదుగదా ॥ఏమొకో॥

ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపు జల్లుల చేర్పుల
వొద్దిక లాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల అందము గాదుగదా ॥ఏమొకొ॥
(శృం. స. 12-82)

ఇందులోని అన్నమాచార్యుల భావుకతాపూర్ణమైన ప్రతిభతోపాటు చక్కటి పదచిత్రాలు, భావచిత్రాలు అత్యంత రసానందానుభూతికి కారణమై మనోహరమై ఒప్పుతున్నాయి.

అన్ని విషయాల వర్ణనతోను అన్నమాచార్యుల భావుకత విదితమవుతుంది.

పూజావిధానం :

ప్రతిలేని పూజ దలపగ గోటిమణుగులై
అతివ పరవశము బ్రహ్మానందమాయ ॥పల్లవి॥ (శృం.సం. 12-30)

వివాహ విధి :

"లక్ష్మీకల్యాణము లలితోంబాడెద మిదెనేమొ
లక్ష్మీనారాయణులే లలనయు నీవును ॥పల్లవి॥
(3-105)

వ్యవసాయపరమైన పదాలు :

శృంగార వర్ణన :

వ్యవసాయపరంగా వర్ణిస్తూ శృంగారాన్ని వివరించిన తీరులో అన్నమాచార్యుల మనోజ్ఞభావుకత స్పష్టమవుతుంది.

కొలిచి బిందెల దోసుకొనుగాక యీ
మలయు కోరికలనెడి మాడలే పండె ॥పల్లవి॥
పొలతి సిగ్గుల పోడు వాడిచి చిత్తపుటడవి
తొలుచూపు పదనునదె దున్నగాను
తలపోత విత్తగా తను చెమట వానలనె
బలువైన తమకమను బంగారు పండె ॥కొలిచి॥
ఇచ్చకపు చిరునగవు లింటిలోపలి తోట
మచ్చు జీకట్లె పలుమరు దవ్వగా
ఎచ్చుకుందుల సొలపు లేతపు జలము వారి
నచ్చుగాకల పైడి నక్కులే పండె ॥కొలిచి॥

తగిలి వేంకటవిభుని తనివోని కౌగిటను
జగడంపు గూర్మి సరసము చల్లగా
నిగనిగని పలుకు దేనియలు వేమరుబారి
నిగుడు విరహాగ్ని మాణికములే పండె ॥కొలిచి॥

(శృం. సం. 12-192)

వ్యవసాయపరంగా వైరాగ్య వర్ణన :

పై పదంలో శృంగారం వర్ణితం కాగా ఈ క్రింది పదంలో వ్యవసాయ పరంగా వైరాగ్యాన్ని వర్ణించిన తీరులో అన్నమాచార్యుల భావుకత, ప్రకృతి పరిశీలనాదక్షత, లోకజ్ఞత మొదలైన అంశాలు విదితమవుతాయి.

పంటల భాగ్యులు వీరా బహువ్యవసాయులు
అంటిముట్టి యిట్లె గాపాడుదురు ఘనులు ॥పల్లవి॥

హొత్తుల పాపమనేటి పోడు నరికివేసి
చిత్తమనియెడు చేనుచేనుగా దున్ని
మత్తిలి శాంతమనే మంచి వానపదనున
విత్తుదురు హరిభక్తి వివేకులు ॥పంటల॥

కామక్రోధాదులనే కలుపు దవ్వివేసి
వేమరు వైరాగ్యమనే వెలుగువెట్టి
దోమటి నాచారవిధుల ఎరువులువేసి
వోముచున్నారు జ్ఞానపు బైరుద్యోగ జనులు ॥పంటల॥

యెందుచూచిన శ్రీవేంకటేశు డున్నాడనియెడి
అందిన చేనిపంట లనుభవించి
సందడించి తమవంటి శరణాగతులు దాము
గొంది నిముడుకొందురు గురుకృప జనులు ॥పంటలు॥

(అధ్యా. సం. 9-70)

"ఎనుపోతులోనెద్దు నేరుగట్టిన యట్లు
మొనసి ముందర సాగదేటి బ్రదుకు"

(అధ్యా. సం. 1-102)

జానపద గేయరీతులు :

ఇంతకుముందే పేర్కొన్నట్లు, అన్నమాచార్యులు ఏలలు, జోలలు, లాలలు మొదలైన జానపదగేయ రీతుల్ని చక్కగా ప్రయోగించినట్లే కోలాటం, సువ్వి మొదలైన బాణీలు వాడుకొన్నాడు. వాటిలోను భావుకత, విశిష్టంగా స్పష్టమవుతుంది.

**కోలాటం :**

గోవింద నందనందన గోపాలకృష్ణ నీ
భావము మాకుం జిక్కె గోపాలకృష్ణ" (శృం. సం. 3-17)

**సువ్విపాట :**

ఇట్టి ముద్దులాడి బాలు డేడవాడు వాని
బట్టి తెచ్చి పొట్టనిండ బాలుపోయరే ॥పల్లవి॥

గామిడై పారితెంచి కాగేటి వెన్నలలోన
చేమపూవు కడియాల చేయివెట్టి
చీమగుట్టెనని తనచెక్కిట గన్నీరుజార
వేమరు వాపోయె వాని వెడ్డువెట్టరే ॥ఇట్టి॥

ముచ్చువలెవచ్చి తన ముంగై మురువుల చేయ
తచ్చేటి పెరుగులోన దగబెట్టి
నొచ్చెనని చేయిదీసి నోరనెల్ల జొల్లుగార
వొచ్చెలి వాపోవు వాని నూరడించరే ॥ఇట్టి॥

యెప్పుడు వచ్చెనో మాయిల్లు చొచ్చి పెట్టెలోన
చెప్పరాని వుంగరాల చేయివెట్టీ
అప్పడైన వేంకటేశు డాసపాలకుడు గాన
తప్పకుండ పెట్టె వాని తలకెత్తెరే ॥ఇట్టి॥

(శృం. సం. 12-148)

ఇట్లాగే ఔచితీ సహమైన లక్ష్మీదేవి వర్ణన అమోఘం.

క్షీరాబ్ధికన్యకు శ్రీమహాలక్ష్మికిని
నీరజాలయకును నీరాజనం ॥పల్లవి॥

జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువు మాణిక్యముల నీరాజనం ॥క్షీరా॥

చరణకిసలయములకు సకియ రంభోరులకు
నిరతమగు ముత్తేల నీరాజనం
అరిది జఘనంబునకు నతివ నత నాభికిని
నిరత నానావర్ణ నీరాజనం ॥క్షీరా॥

పగలు శ్రీవేంకటేశు పట్టపురాణియై
నెగడు సతికళలకును నీరాజనం
జగతి నలమేల్మంగ చక్కదనములకెల్ల
నిగుడు నిజశోభనపు నీరాజనం ॥క్షీరా॥

(శృం. 26-295)

ఇందులో నాయికావర్ణన మనోజ్ఞం. ప్రబంధకనులు నాయిక కచకుచాది వర్ణనలు చేయడం మామూలు విషయం. ఇక్కడ అన్నమాచార్యులు సైతం నాయికను వర్ణించిన తీరులో పద్యకవులకంటే విశిష్టంగా ఔచితీసహంగా వర్ణించడం విశేషాల్లో విశేషం. అదే అన్నమాచార్యుల పదకవితాముద్ర.

ఇలాగా పై పరిశీలనవల్ల అన్నమాచార్యులు జానపదకవులకు అతి సన్నిహితమైన పద్ధతిలో పదరచన చేసినా, ప్రబంధకవులకంటే మరింత విశిష్టంగా భావుకతా పరిపూర్ణమైన ప్రతిభాపాటవం పాటించడంలో ఆయన కాయనే సాటి. పద్యకవులకు సాధ్యంగాని సారళ్యాన్ని, పదరచనా లాలిత్యాన్ని శైలిలో కూర్చడమేగాక సంగీతాభినయాలకు ప్రాతినిధ్యమివ్వడం అన్నమాచార్యులను మహావాగ్గేయకారుడని చాటిచెప్తుంది. అందుకే ఆ మహనీయుడు అమరుడు; ఆయన సంకీర్తనలు కలకాలం ప్రజల నోళ్ళలో నలుగుతూనే ఉంటాయి.

# 5. అన్నమాచార్యుల ఆధ్యాత్మిక చింతన

తాళ్ళపాక అన్నమాచార్యులు తెలుగు వాగ్గేయకారుల్లో ఆద్యుడు; అనవద్యుడు. ఆ మహనీయుడు రచించి సంకీర్తించిన సంకీర్తనల్లో శృంగార సంకీర్తనలతోపాటు అధ్యాత్మ సంకీర్తనలు ఉన్నాయి. వాటిలో భక్తితోపాటు ఆధ్యాత్మిక చింతనను అభివ్యక్తీకరించి భారతీయ సంస్కృతిని పరిరక్షించిన మహనీయుడాయన.

అన్నమాచార్యులు జన్మించే సమయానికి భారతదేశమంతటా శ్రీకృష్ణ భక్తిపూరితంగా గేయసాహిత్యం వెలిసింది. పదసాహిత్యం భక్తితత్త్వానికి పట్టుగొమ్మ అయింది. భక్తిభావన భారతీయతత్త్వం. ఈ భక్తితోపాటు పద సాహిత్యం వికాసం పొందుతూ వచ్చింది. క్రీ.శ. 12వ శతాబ్దంలో వెలసిన జయదేవుడు గీతగోవిందం అష్టపదులలో రచించిన సంస్కృత గేయకావ్యం. రాధాకృష్ణుల అమరప్రేమను భక్తిపురస్సరంగా తెలిపే గీత నృత్య కావ్యమది, జయదేవుడు పాడుతూండగా ఆయన భార్య పద్మావతి అభినయించేదట. శ్రీలీలాశుక మహాకవి రచిత శ్రీకృష్ణ కర్ణామృతం శ్లోకాల్లో రచితమైన శ్రీకృష్ణ భక్తికి పరాకాష్ఠ. తెలుగువాడైన శివనారాయణతీర్థులు సంస్కృతంలో రచించిన శ్రీకృష్ణ లీలాతరంగిణి భాగవత భక్తితత్త్వానికి ఉత్తమోదాహరణ. ఇది గీతనృత్య కావ్యం.

సంస్కృతంలో లాగానే భారతీయ భాషలన్నింటా శ్రీకృష్ణ భక్తి పూరితమైన గీతాలు రచితమై ప్రచారంలోకి వచ్చాయి. కృష్ణభక్తికి వంగదేశం ఆటపట్టు. ముందే పేర్కొన్న గీతగోవిందం సంస్కృతంలో రచితమై బహుళ ప్రచారం పొందింది. కృష్ణభక్తి ప్రతిపాదకుల్లో మొదటివాడు వల్లభాచార్యుడు. తరువాత కృష్ణభక్తి పారమ్యం పొంది ప్రచారం చేసిన మహనీయుడు చైతన్య స్వామి. ఈతని శిష్యులు సంస్కృతంలోను వంగభాషలోను అనేక కృష్ణ భక్తి పూరిత గీతాలు రచించి ప్రచారం చేశారు. వల్లభాచార్యుల శిష్యులు "అష్ట ఛాప్" అని పేరు గడించారు. వారిలో సూరదాసు భక్తాగ్రేసరుడు. ఆయన కృష్ణ భక్తితత్వం అపారం. హిందీలో దాసత్రయం సూరదాసు, కబీర్‌దాసు, తులసీదాసు అనేవారు. అలాగే విద్యాపతి మైథిలీ భాషలో రాధాకృష్ణపూరిత పదాలనేకం రచించాడు. విద్యాపతి పదాలను చైతన్యస్వామి ఆలపించి పరవశించేవాడట. విద్యాపతిలాగే చండీదాసు సైతం భక్తిపూరిత గీతాలు

రచించి ప్రసిద్ధికెక్కాడు. రాజస్థాన్‌కి చెందిన మీరాబాయి మహా కృష్ణభక్తురాలు. ఈమె రాజస్థానీ, గుజరాతీ, వ్రజ, హిందీభాషల్లో 240 కృతులు కృష్ణ భక్తి పారమ్యంగా రచించి తరించింది. మహారాష్ట్రలో యాభైమంది భక్తులుండేవారు. వారిలో జ్ఞానదేవ్, నామదేవులు, అభంగసలు భక్తిపూరితంగా రచించి పాడి ప్రచారం చేశారు. ఇలాగే భక్తతుకారామ్ పేర్కోదగ్గ భక్తుడు.

ఇలాగా ఔత్తరాహ భాషల్లో పదకవిత కృష్ణభక్తితో ప్రచారంలోకి వచ్చింది. అయితే దాక్షిణాత్య భాషల్లో ముఖ్యంగా తమిళంలో ప్రాచీన కాలంలోనే వైష్ణవ భక్తిపూరితంగా పదాలు రచితమయ్యాయి. వైష్ణవ భక్తి గీతాలకు పట్టుగొమ్మలు పన్నిద్దరాళ్వారులు. ఆళ్వారులు పన్నెండుమంది. వీరు భక్తిపూరితంగా ప్రజల భాషలో పాడిన మధురగేయాలు నాలుగువేల గేయాలు. ఆళ్వారుల్లో నమ్మాళ్వారు శ్రేష్ఠుడు. వీరిలో మహా విష్ణుభక్తురాలు ఆండాళ్ (గోదాదేవి) పెరియాళ్వారు పుత్రిక. ఆమె భక్తిపారవశ్యంతో ముప్పై పాశురాలు పాడింది. వాటికి ఈనాడూ బహుళ ప్రచారముంది. ఈ మధుర గీతాలను దివ్యప్రబంధా లంటారు. తమిళవేదమని ప్రసిద్ధి. ఆవెనుక రామానుజులు శ్రీ వైష్ణవమతాన్ని స్థాపించాడు. మలయాళంలోను భక్తికి కొదవలేదు. ఆళ్వారుల కృష్ణభక్తి కన్నడ దేశానికి ప్రాకింది. దాస సాహిత్యం కన్నడంలో ముఖ్యమైంది. దానికి మూలవిరాట్టు క్రీ.శ. 13వ శతాబ్దంలో ఉడిపివద్ద అవతరించిన ద్వైతమత ప్రవక్తలైన మధ్వాచార్యులు. భాగవత భక్తితత్వాన్ని ప్రచారంలోకి తెచ్చిన మహనీయుడు. ఇతని శిష్యుడు పద్మనాభ తీర్థులు; ఇతని శిష్యుడు శ్రీపాదరాయలు. కన్నడంలో 'దేవరనామము'లనబడే కీర్తనలు రచించి పూజాసమయంలో పాడే పద్ధతిని ప్రవేశపెట్టిన ఘనుడు. ఇతని శిష్యుడు ప్రసిద్ధుడు వ్యాసరాయలు. ఆయన శిష్యుల్లో పురందరదాస, కనకదాసులు సుప్రసిద్ధులు. వీరందరు కృష్ణభక్తి ప్రతిపాదిత పదాలు రచించి తరించి ప్రచారం చేశారు. ఇంకా అనేక పదకర్తలున్నారు.

ఈ నేపథ్యంలో కృష్ణభక్తి వాతావరణంలో తాళ్ళపాక అన్నమాచార్యులు జన్మించి శ్రీ వేంకటేశ్వరోపాసకులై భక్తితత్వాన్ని ప్రచారంచేశాడు. ఆయనతోపాటు కుమారుడు పెదతిరుమలాచార్యుడు, మనుమడు చినతిరుమలాచార్యుడు సైతం పదరచనలో దిట్టలు. అన్నమాచార్యుడు 1408లో జన్మించి 1503లో దివంగతుడయ్యాడు. జీవితాంతం శ్రీవేంకటేశ్వరస్వామి కైంకర్యంలోనే గడపిన ఈ మహనీయుడు 32వేల సంకీర్తనలు రచించి తరించాడు.

ఇందులో శృంగార సంకీర్తనలతోపాటు అధ్యాత్మ సంకీర్తనలు సైతం రచించి ఆధ్యాత్మిక తత్వస్వరూప నిరూపణం చేయడం గమనించగలము. భక్తి, శృంగారం, మధురభక్తి, నీతివైరాగ్యాలతోపాటు ఆధ్యాత్మికచింతనా పర తత్వాన్ని ప్రబోధించాడు. అలాంటి అన్నమాచార్యుల ఆధ్యాత్మికచింతనా పరతత్వ మెలాంటిదో పరిశీలిద్దాము.

ద్రావిడ వేదమని ప్రసిద్ధిగాంచిన ద్రావిడ ప్రబంధాల్లోని కృష్ణ భక్తి తత్వాన్ని, శ్రీ రామానుజాచార్య ప్రతిష్ఠాపితమైన శ్రీ వైష్ణవ మతతత్వాన్ని జయదేవాదుల కృష్ణ భక్తిస్వరూపాన్ని ఆకళింపుకొన్న అన్నమాచార్యులు, ఆనాటి రాజ గౌరవప్రదమైన పండితైకవేద్యమైన పద్యాన్ని వదలి, అతి సామాన్య ప్రజానీకంలో ప్రచారంలో ఉన్న జానపద గేయరీతుల్ని స్వీకరించి భక్తిని ప్రచారం చేయనారంభించాడు. శ్రీ వేంకటేశ్వరునిపై శృంగార, అధ్యాత్మ సంకీర్తనల్ని దినానికొక్కటిగా రచించి, పాడి, ఆడి తరించాడు. అందులో భక్తితోపాటు ముక్తికి మార్గమైన అధ్యాత్మికతను వెదజల్లి ప్రజా సముదాయానికి ఎంతో మేలు చేసిపోయాడు. ఆధ్యాత్మికము- అంటే ఆధి దైవికము, ఆధ్యాత్మికము, ఆధిభౌతికము- అనే వాటిలో ఒకటి. ఇది ఆత్మ విషయకమైనది. అధ్యాత్మికత అంటే ఆధ్యాత్మికవిద్య- అంటే ఆత్మసంబంధ మైనఆలోచనా సంబంధి అయిన వివేచన. ఆత్మను గురించి చెప్పే జ్ఞానం. ఆత్మపరమాత్మల సంబంధాన్ని వివరించే జ్ఞానం. ఆత్మజ్ఞానం ఈ విషయాన్ని ఆధ్యాత్మికతత్వాన్ని చక్కగా వివరించాడు అన్నమాచార్యులు. శృంగార సంకీర్తనలతోపాటు అధ్యాత్మ సంకీర్తనలు రచించిన అన్నమయ్య ఇలా వివరించాడు—

"దేహాత్మేశ వివేకో
త్సాహంబును లోకవేద ధర్మాధర్మా
ద్యూహాపోహంబులు గల
యా హరి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్"

దేహం, ఆత్మ, పరమాత్మ సంబంధమైన విశేషాలను, లోకం, వేదం, ధర్మం, అధర్మం వీటికి సంబంధించిన ప్రజల్లోని ఊహాపోహాలు మొదలైన విశేషాలను వివరించే హరిసంకీర్తనలే అధ్యాత్మ సంకీర్తనలని వివరించాడు. అలాంటి అధ్యాత్మ సంకీర్తనల్లోని ఆధ్యాత్మికతను పరిశీలిద్దాము.

హైందవమతంలో ద్వైతాద్వైత, విశిష్టాద్వైత మతాలనే భేదాలు ముఖ్యమైనవి. వీటి కాచార్యులు మధ్వాచార్య, శంకరాచార్య, రామానుజా చార్యులు- అనే త్రి మతాచార్యులు. సంక్షిప్తంగా ఈ త్రిమతాల సిద్ధాంతా లివి. జీవాత్మ పరమాత్మలు ఎల్లప్పుడూ అంటే మోక్షానంతరం గూడా- వేర్వేరని ద్వైతమత సిద్ధాంతం. జీవాత్మ పరమాత్మలకు దశాభేదమేగానీ, వస్తుతః రెండూ ఒక్కటేనని అద్వైత మతసిద్ధాంతం. జీవాత్మ పరమాత్మలు ఒక్కటే అయినప్పటికి శరీర శరీరి భావంతో వాటిసంబంధంకూడా ఉంటుంది. శరీరి ప్రధానం; శాశ్వతం; శరీర మప్రధానం; అశాశ్వతం. కనుకనే అశాశ్వత మైన శరీరం శాశ్వతమైన శరీరిని ఆశ్రయించి ఉంటుందని విశిష్టాద్వైత మత సిద్ధాంతం. ఇది శ్రీరామానుజాచార్య సిద్ధాంతం. దీన్నే త్రికరణశుద్ధిగా విశ్వసించి తదుచితరీతిని అన్నమాచార్యులు శాశ్వతుడైన భగవంతునికై తన జీవితాన్ని కైంకర్యం చేసి తరించాడు. దాన్ని భగవద్భక్తితో, రక్తితో, ఆధ్యాత్మికచింతనతో నీతి, వైరాగ్య ప్రబోధంలో తన సంకీర్తనలన్నిటా నిరూపించి నిత్యుడయ్యాడు అన్నమాచార్యులు.

యజ్ఞాలు, యాగాలు అనేవి పండితులకు మాత్రమే, జ్ఞానులకుమాత్రమే తెలిసినవి. వాటిద్వారా మోక్షసాధన మనే విషయం సామాన్యులకు తెలియని అంశం. అలాంటి గహనమైన అంశాన్ని ఎంతో సులభతరంగా అందరికీ అర్థమయ్యే రీతిలో ప్రబోధించడం అన్నమాచార్యుల సంకీర్తనల్లో మనం గమనించగలం.

గురుభక్తి పురస్సరంగా భగవద్భక్తిని జ్ఞానమనే యజ్ఞంతో పోల్చి వైరాగ్య భావపూరితంగా, అత్యంత మనోహరంగా, అలంకారిక శైలీ విన్యాసంతో ఆలపించాడు అన్నమాచార్యులు. తన గురువు నడపిన జ్ఞానమనే యజ్ఞాన్ని వివరించాడు అన్నమాచార్యులు. అది ఎలా మోక్షసాధన మనే అంశాన్ని వివరించాడు. దేహమే యజ్ఞశాల. అందులో అజ్ఞానమనే పశువును బంధించి, వైరాగ్యమనే కత్తులతో నరికి, జ్ఞానాగ్నిలో గురువు వేల్చివేశాడట. వైష్ణవులనే మునుల సభ నేర్పాటుచేసి, శ్రీపాదతీర్థమనే సోమపాశం నుంచి సంకీర్తనమనే సామగానంలో యజ్ఞం సంపూర్తి చేశాడట గురుడు. గురుప్రసాద మనే పురోడాశం ఇచ్చి ద్వయమనే మంత్రమనే కుండలాలు పెట్టి హృదయంలో శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షీకరించి స్వరూపదీక్ష ఇచ్చాడట గురుడు. ఇందులో

వేదాంతమంతా వైరాగ్య ప్రబోధంలో అభివ్యక్తీకరించాడు అన్నమాచార్యులు.

"జ్ఞానయజ్ఞ మీగతి మోక్షసాధన
నానార్థములు నిన్నే నడిపె మాగురుడు ॥పల్లవి॥

అలరి దేహమనేటి యాగశాలలోన
బలువై యజ్ఞానపు పశువు బంధించి
కలసి వైరాగ్యపు కత్తుల గోసికోసి
వెలయజ్ఞానాగ్నిలో వేలిచె మాగురుడు ॥జ్ఞాన॥

మొక్కుచు వైష్ణవులనే మునిసభ గూడవెట్టి
బొక్కుచు శ్రీపాదతీర్థ సోమపానము నించి
చక్కగా సంకీర్తన సామగానము చేసి
యిక్కువతో యజ్ఞము సేయించేటో మాగురుడు ॥జ్ఞాన॥

తదియ్య గురుప్రసాదపు పురోడాశమిచ్చి
కొదదీర ద్వయమను కుండలంబులు వెట్టి
ఎదలో శ్రీవేంకటేశునిట్లు ప్రత్యక్షము చేసె
యిదివో స్వరూపదీక్ష యిచ్చెను మాగురుడు ॥జ్ఞాన॥

(అధ్యా. సం. 1-148)

ఇలాగే వ్యాఖ్యానం అవసరం లేకుండా సులభరీతిలో దేహం, ఆత్మ పరమాత్మలగూర్చి అన్నమాచార్యుల వివరణ అరటిపండు వొలిచి నోటి కందిచ్చిన రీతిలో సాగింది వేదాంత చర్చ ఈ పదంలో-

"ఓహోహో డేండేం నోగిబ్రహ్మమిది యని
సాహసమున శ్రుతిచాటెడిని ॥పల్లవి॥

పరమును నపరము బ్రకృతియు ననగా
నెరవు దెలియుటే వివేకము
పరము దేవుడును, అపరము జీవుడు;
తిరమైన ప్రకృతియె దేహము ॥ఓహో॥

జ్ఞానము జ్ఞేయము జ్ఞానగమ్యమును
పూని తెలియుటే యోగము
జ్ఞానము దేహాత్మ, జ్ఞేయము పరమాత్మ
జ్ఞానగమ్యమే సాధించు మనసు ॥ఓ హో॥

క్షరము నక్షరము సాక్షి పురుషుడని
సరవి దెలియుటే సాత్త్వికము
క్షరము ప్రపంచ మక్షరము కూటస్థుడు
సిరిపురుషోత్తముడే శ్రీవేంకటేశుడు ॥ఓ హో॥

(అధ్యా. సం. 1-396)

ఇలాగే భగవద్గీతా సారాన్నంతా ఔపోసనం బట్టి ఆత్మ, దేహం వీటిని గూర్చిన వివరణ ఎంతో సహజంగా, సరళంగా, సర్వజన సుబోధంగా సంకీర్తన రచనచేసి, ఆధ్యాత్మిక చింతనాపరతను వేదాంతోపదేశం చేయడంలో అన్నమాచార్యులకు సాటి ఆయనే; సందేహం లేదు. భగవద్గీతలో వివరించిన తీరుగా దేహం నశిస్తుంది. దేహి అంటే ఆత్మకు నాశంలేదు అనే అంశాన్ని ఈ కీర్తనలో బహుధా ప్రశంసనీయంగా వివరించడం గమనించదగ్గ అంశం.

"దేహి నిత్యుడు దేహము లనిత్యాలు
యీహలనా మనసా ఇది మరువకుమీ ॥పల్లవి॥

గుదిపాతచీరమాని కొత్తచీరగట్టినట్టు
ముదిమేనుమాని దేహమొగి గొత్తమేనుమోచు
అదన జంపగలేవు ఆయుధము లితని
గదిసి యగ్నియు నీరు గాలి జంపగలేవు ॥దేహి॥

ఈతడు నరకు వడ డీత డగ్నిగాలడు
ఈతడు నీటమునుగ డీతడు గాలిబోడు
చేతనుడై సర్వగతుండౌ చెలియించ డేమిటను
యీతల ననాది యీత డిరవు గదలడు ॥దేహి॥

చేరి కానరానివాడు చింతింపరానివాడు
భారపు వికారాలు బాసినవాడే యాత్మ
ఆరయ శ్రీవేంకటేశనాధీన మీతడని
సారము దెలియుటే సత్యం జ్ఞానము ॥దేహి॥
(అధ్యా. సం. 2-419)

ఈ సంకీర్తనలో అన్నమాచార్యుడు ఆత్మస్వరూపాన్ని నిరూపించాడు. భగవద్గీత సాంఖ్యయోగంలోని 22, 23,24,25 శ్లోకాల సారాన్ని ఇందులో పొందుపరచినట్లు స్పష్టమవుతుంది. దేహి అంటే ఆత్మ నిత్యం. దేహం అనిత్యం. ఈ సంకీర్తనలోని మొదటి చరణంలోని మొదటి రెండు పంక్తులు భగవద్గీతా శ్లోకభావాన్ని వ్యక్తీకరిస్తాయి.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ" (2-22)

(మానవుడు చిరిగిపోయిన వస్త్రాలను వదలిపెట్టి ఇతర నూతనవస్త్రాలను ధరించినట్లు ఆత్మ జీర్ణమైన దేహాలను వదలినూతనదేహాలను ధరిస్తూంటుంది.)

ఇలాగే తరువాతి రెండుపంక్తులు రెండో చరణంలోని భావాలను గీత లోని ఈ రెండు శ్లోకాలభావాన్ని తెలుపుతాయి.

"నైనం ఛిందంతి శస్త్రాణినైనందహతి పావకః
నచైనంక్లేదయం త్యాపో నశోషయతి మారుతః
అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః"
(2-23, 24)

(ఈ ఆత్మ చీల్చబడదు; కాల్చబడదు; అగ్ని దహింపజాలదు; నీళ్ళు తడుపజాలదు. గాలి నిరోధింపజాలదు.

ఈ ఆత్మ చీల్చరానిది; కాల్చరానిది; తడుపరానిది; ఎండింపరానిది. ఇది నిత్యం; సర్వవ్యాపి; స్థిరమైనది; మార్పులేనిది; సనాతనం.)

సంకీర్తనలోని మూడోచరణంలోని భావం భగవద్గీతలోని ఈ శ్లోక భావాన్ని వ్యక్తీకరిస్తుంది.

"అవ్యక్తోఽయ మచింత్యోఽయ మతికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి" (2-25)

(ఈ ఆత్మ అవ్యక్తం. అంటే ఇంద్రియాదులకు అగోచరమైనది; అచింత్యం- అంటే మనస్సునకు అతీతమైంది; మార్పులేనిది. అందువల్ల దీన్ని గమనించి దుఃఖించడం అనుచితం.)

ఇలాగా భగవద్గీతలోని సారాంశాన్ని ఎంతో సముచితంగా సామాన్య ప్రజానీకానికి అవగతమయ్యేలా అన్నమాచార్యులు ఈ సంకీర్తనలో వివరించడం విశేషం. అంతేగాక సంకీర్తన చివరి "సత్యం జ్ఞానము" అనేమాటల మూలాన "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మః" అనే శ్రుతివాక్యాల్ని సైతం ఇందులో అన్నమాచార్యులు జోడించడం ఆయనకున్న వేదవేదాంత జ్ఞానానికి చక్కటి నిదర్శనం. శ్రుతిస్మృతుల సారాన్ని సైతం సామాన్య ప్రజలకు తన సంకీర్తనద్వారా అందించడమే అన్నమాచార్యులలోని గొప్పదనం విదిత మవుతుంది. ఆయన ధ్యేయమదే. దీనిద్వారా ఆ లక్ష్యం నెరవేరినట్లు గ్రహించవచ్చు.

ఇంతటితోనే అన్నమాచార్యులు ఆగక పుట్టిన జీవి మరణిస్తుందనీ, మరణించి మళ్ళీ పుడుతుందనీ "పునరపి, జననం పునరపి మరణం" అనే అంశాన్ని భగవద్గీతలోని ఈ శ్లోకభావాన్ని మరో సంకీర్తనలో ఎంతోచక్కగా వివరించాడు.

"జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మమృతస్య చ
తస్మాద పరిహార్యేఽర్థే నత్వం శోచితు మర్హసి" (2-27)

(పుట్టినవానికి మరణం నిశ్చయం. మరణించిన వానికి జన్మ నిశ్చయం. కనుక తప్పింప శక్యం కాని ఈ విషయానికి దుఃఖింపనవసరం లేదు.

ఈ భావాన్ని అన్నమార్యులు తన సంకీర్తనలో చక్కగా వ్యక్తీకరించాడు.

"ఇది యరుదను నొకడిది యరుదని చెప్పు
యిది యరుదని విను నెవ్వడూ నెరగడు ॥పల్లవి॥
పుట్టినవానికి నెల్లా భువి మరణము నిత్య
మట్టే చచ్చినవారి కవ్వల జననము
పుట్టినినాడై తేను పొడగానరాదుమేను
కొట్టగొన గానిరాదు కొన్నాళ్ళే కాని ॥ఇది॥

జీవుడు నిత్యుడేమిటా జెరుపగరానివాడు
యీ వివేకము దెలిసి యేజాతివారైనా
దైవికమే నమ్మి తమధర్మముల బాయరాదు
సావధాన మిదియే సంసారయోగము ॥ఇది॥

చిత్తమా నీలోపలను శ్రీవేంకటేశ్వరుడు
పొత్తున కూడున్నవాడు పొంగి పాయకు నీవు
యెత్తినా దేహగుణము ఇది జీవగుణమిది
ఇత్తలాదైన గుణము యిది మరవకుమీ ॥ఇది॥

(అధ్యా. సం. 3-421)

కనుకనే భగవద్భక్తి ద్వారా మోక్షం పొందడమే ముఖ్యమనీ, భగవద్భజనం ద్వారా సాధించవచ్చుననీ అనేకరీతుల భగవంతుని అర్చించి చివరికి సర్వాత్మనా సమర్పించుకోవడమే ముఖ్యమని అన్నమాచార్యులు వివిధ రీతుల వివరించాడు తన సంకీర్తనద్వారా, ఈ శరీరాన్ని వీణగా చేసి పాడుతాడట; ఈ శరీరాన్ని గుడిగా చేసి పూజచేస్తాడట; జీవుడు ఈ దేహాన్ని రథంగా చేసి తోలుతాడట. చూడండి ఎంత మనోజ్ఞంగా సామాన్యజన అర్థావగతికి ఎంత సన్నిహితంగా చెప్పగలడో వివరించాడీ సంకీర్తనల్లో అన్నమాచార్యులు.

ఈ శరీరం వీణగా చేసి సదా పాడుతామని వివరించాడు.

"పాడేము నేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పదిరెండువేళల రాగాలను ॥పల్లవి॥

తనువేవొళవు తలయే దండెకాయ
ఘనమైన పూర్వులు రెండు కట్టినతాళ్ళు
మనసే నీబద్దికాడు మరి గుణాలే జీవాళి
మొనసిపుట్టుగే మూలమైన కరడి ॥పాడేము॥

(అధ్యా. సం. 3-467)

శరీరాన్ని సరిగాచేసి నిత్యపూజలు చేసేతీరు వర్ణితం.

నిత్యపూజలివిగో నేరిచిన నోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥పల్లవి॥

తనువే గుడియట తలయే శిఖరమట
పెనుహృదయమే హరిపీఠమట
కనుగొన చూపులే ఘనదీపములట
తనలోపలి యంతర్యామికిని ॥నిత్య॥
(అధ్యా. సం. 2-82)

ఇలాగే దేహధర్మాన్ని జీవుడు తోలుతున్నాడట.

"గుఱ్ఱాల గట్టని తేరు కొంకకెంధ్రైనాబారి
విఱ్ఱవీగుచు దీసీని వేడుకతో జీవుడు ॥పల్లవి॥
సరిపిరుదే రెండు జంటబండికండ్లు
సరవితో బాగాలు చాపు నొగలు
గరిమచూపులు రెండుగట్టిన పగ్గములు
దొరయై దేహరథము దోలిబో నివుడు ॥గుఱ్ఱాల॥
(అధ్యా. సం. 2-152)

పై నుదాహరించిన సంకీర్తనల్లో మొదటిదానిలో 'ఊర్పు'లను తాళ్ళుగాను, మూడో సంకీర్తనల్లో మొదటిదానితో 'చూపులు' పగ్గాలుగాను, రెండో సంకీర్తనలో ఈ 'చూపు'లే 'ఘనదీపములు'గాను భావించడంలో ఆయా సందర్భోచితమైన ఔచిత్యం గుర్తించిన అన్నమాచార్యుల భావనా బలమెంతటిదని పొగడగలము! ఆయనలోని వస్తుతః ఉత్తమకవి నేమని ప్రశంసిస్తాము ?

ఇలాగా అన్నమాచార్యుల ఆధ్యాత్మిక ప్రతిపత్తికి ఎన్నైనా ఉదాహరణలు చూపవచ్చు. దీనితోపాటు వైరాగ్యప్రబోధం గమనించదగ్గది; అది సహజమై ఒప్పుతూంటుంది.

"పోరాకపోయి తలపున నున్న దైవంబు
జేరనొల్లక పరులజేర దిరిగెదము" (అధ్యా. సం. 1-331)

అని తెలిపి—

"పోయగాలం బడవీక గాయు వెన్నెల కరణిని
శ్రీయుతు దలచుడి నరులు మాయబడీ చెడక"(అధ్యాసం. 1-194)

అని హెచ్చరించి హరి నామస్మరణమే మోక్షదాయకమనీ, కాలం వృథా పోనీయకుడనీ ప్రబోధించిన మహనీయుడు అన్నమాచార్యులు.

భక్తి ముక్తికి సోపానం. ఆ భగవద్భక్తి శ్రీహరి సంస్మరణమే- సహజ రీతిని సరళ పద్ధతిలో సరసంగా ప్రబోధిస్తున్నాడు అన్నమాచార్యులు.

"హరిసేవొకటే యనంతము
గురుబోధలకును కొలదే లేదు ||పల్లవి||

తలచినకొలదే తనలో భావము
నిలిపిన కొలదే పరమగు సత్యము
పలికినకొలదే నేమము
యిలనెవ్వరికిని యెక్కుడులేదు ||హరి||

జరిపిన కొలదే సకలాచారము
నెరపిన కొలదే నిజకీర్తి
తిరము సేయుకొలదే ధర్మంబును
యిరవుగనందుకు నెక్కుడులేదు ||హరి||

చేసినకొలదే చేకొను కర్మము
పోసినకొలదే రుచివిరతి
అసల శ్రీవేంకటాధిపు శరణను
దాసుడే యెక్కుడు తప్పేలేదు ||హరి||

(అధ్యా. సం. 2-420)

ఇలాగా భక్తితత్వ ప్రబోధంతో ఆధ్యాత్మికచింతనా పరతత్వాన్ని ప్రబోధించాడు మహనీయుడు ఆ అన్నమాచార్యులు. ఇది సర్వజనానుసరణీయ మని వేరుగా చెప్పనవసరం లేదు. ఇలా ప్రత్యేకించి తెలుగుసీమలో జన్మించిన అన్నమాచార్యులు తెలుగువారందరికీ గర్వకారణం!



# 6. తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనలు - సామాజిక స్పృహ

"శ్రుతులై, శాస్త్రములై, పురాణకథలై, సుజ్ఞానసారంబులై
యతిలోకాగమ వీధులై, వివిధ మంత్రార్థంబులై, నీతులై,
కృతులై, వేంకటశైలవల్లభరతి క్రీడారహస్యంబులై,
నుతులై, తాళులపాక యన్నయ వచోనూత్నక్రియల్ చెన్నగున్"

(సంకీర్తన లక్షణం - ప. 12)

తాళ్ళపాక అన్నమయ్య 1408లో జన్మించి 1503లో పరమధామం చేరి ఇప్పటికి 494 సంవత్సరాలు గడిచాయి. ఇది అన్నమయ్య 494వ వర్ధంతి మహోత్సవం. ఈ మహోత్సవంలో పాలుపంచుకొని ఆ మహనీయుని సంస్మరించుకొని అవకాశం కలిగినందుకెంతగానో సంతోషిస్తున్నాను.

తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనల్లోని సామాజికస్పృహను గూర్చి ప్రసంగించమని కోరడం ఆనందదాయకం. 'సామాజిక స్పృహ' అనేది ఇటీవలి ఆధునికయుగంలోని భావన, ఆలోచన; ఆలోచనాధోరణి; (Modern Concept). సామాజిక- సమాజ సంబంధమైన స్పృహ- ఆలోచన, భావన అని అర్థం. స్పృహ అంటే కోరిక, ప్రగాఢమైన ఇచ్ఛ అనే అర్థాలున్నాయి. ఇంగ్లీషు 'Awareness'కి సమంగా ఈనాడీ మాటను ప్రయోగిస్తున్నాము. ఆధునిక యుగంలో రచయితల గూర్చి చెప్పే సందర్భంలో సామాజిక స్పృహను గూర్చి చెప్పడం పరిపాటి. అంతేగాదు; ఆధునిక యుగంలో మార్క్సిస్టు భావజాలం అంటే వామపక్ష స్వామ్యవాద సిద్ధాంతాలు ప్రబలిన తరువాతనే ఈ సమాజం, సమాజ సంబధి ఆలోచన తత్స్పృహ వాడుకలోకి వచ్చాయని నా తలంపు. అయినా ప్రాచీనకవులకిది వర్తిస్తుందా అంటే వర్తిస్తుందనే చెప్పవచ్చు కానీ ఈనాటి వర్గదృష్టి వారికి లేదని మనవి. ఈనాడు మనం సమాజం గురించి చెబుతున్నాము. ఆనాడూ సమాజముంది. కానీ ఆనాడు రాజులు, రాజ్యాలు, ప్రజలు, పాలకులు, పాలితులు. ఆనాడు రాజు సర్వాధికారి. ఆయన శాసనం శిరోధార్యం. ఈనాడు ప్రజలే శాసకులు; నిర్ణేతలు. ప్రజాసంక్షేమమే ధ్యేయం. ప్రాచీన సాహిత్యంలో సమాజం లేదన లేము. కారణం సాహిత్యం సమాజ ప్రతిబింబం గదా ! ఏ కవి అయినా

ఆనాటి సాహిత్యంలో, తాను సృజిస్తున్న కావ్యంలో తప్పక తానుద్దేశించక పోయినా సమాజం తొంగిచూస్తూ ఉంటుంది. కారణం ఆ కవిగూడా సమాజం లోని వ్యక్తి గనుక. కనుకనే అన్నమయ్య సంకీర్తన సాహిత్యంలో సామాజిక స్పృహ అంటే- సమాజసంబంధమైన- విషయాలు అనేకం మనం చూడగలం. మరో అంశం సైతం మనం గమనించవలసి ఉంది. పద్యకవుల కంటే పద కవులు భిన్నులు. పద్యకవులు రాజాస్థానాలకే పరిమితమైనవారు. కానీ పద కవులు- వాగ్గేయకారులు- సమాజంలోని అంటే ప్రజల్లోని కవులు- అంటే ప్రజాకవులు. వారిలో సామాజికస్పృహ ఉంటుందని వేరుగా చెప్పనవసరం లేదు. కనుక అన్నమయ్య ప్రజాకవి. ప్రజలలో ఒకడై ప్రజల కనుగుణమైన పదాన్ని స్వీకరించి శ్రీ వేంకటేశ్వరుని గూర్చి పాడి, ఆడి తరించిన మహ నీయుడు.

తాళ్ళపాక అన్నమయ్య కారణజన్ముడు; సందేహం లేదు. ఆ మహ నీయుని జననం తెలుగులో పదకవితావిర్భావ వికాసాలకు కారణభూతమైందని వేరుగా చెప్పనవసరం లేదు. పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ ప్రసిద్ధిగాంచిన మహావాగ్గేయకారుడు. వేలకొలది పదాలు రచించి, భక్తి ప్రపత్తులను, నీతివైరాగ్యాలను ప్రబోధించి ఆనాటి సమాజాన్ని పదకవితల్లో హొందుపరచిన వైతాళికుడు; ప్రజాకవి అన్నమాచార్యుడు పదకవిగా నిరూ పించుకొనే నాటికి తెలుగు సాహితీరంగంలో పద్యకవితకు పట్టాభిషేకం జరుగుతూంది. పద్యం కవితకు పరమావధి. పద్యకవి పరమపూజనీయుడు. భారతానువాదంతో ప్రారంభమైన తెలుగు కవిత కావ్యానువాదరీతికి పరిణ మిస్తూంది. పురాణేతిహాస కవిత కావ్యకవితగా రూపుదిద్దుకొంటూంది. పద్యం రాజాస్థానాల్లో, పండిత పరిషత్తుల్లో ప్రాతినిధ్యం వహిస్తూంది. శ్రీనాథుడు కనకాభిషేకానికి నోచుకొన్నాడు. 'మందారమకరందాలను' తెలుగు ప్రజల కందిస్తూన్నాడు పోతన భాగవత భక్తిపరిపూరితంగా. అయితే పద్యం పండి తులకు మాత్రమే పరిమితం. సామాన్య జనసముదాయానికి భక్తి, నీతి, వైరా గ్యాలను ప్రబోధించే ప్రక్రియలేదు. ఆనాటికి, అంతకుముందూ జానపదుల రసనలపై నాట్యమాడే జానపద గేయాలు లేకపోలేదు. అయితే 'ముదివిటులు విధవలంజలు పదకవితలు'గా ఆనాటి పండితుల ఈసడింపులకు గురికావటం వల్ల వాటికి ప్రామాణికత లేదు. అందుకే అన్నమయ్య పండితులకు మాత్రమే పరిమితమైన పద్యకవితను వదలి పదకవితను వరించి, జానపదకవితను

నిబద్ధీకరించి పద్యం పక్కనే పదానికి సరిపీఠం వేయించిన మహనీయుడు. జానపద గేయరీతులను, ఫణితులను ప్రజల వాడుకలో ఉన్నవాటినే-స్వీకరించి వాటికి ప్రామాణికతను గూర్చి, శ్రీవేంకటేశ్వరస్వామి సంకీర్తనతోపాటు ప్రజలకు ఆధ్యాత్మికత, భక్తి, నీతి, వైరాగ్యాలను ప్రబోధించడానికి తగిన అధ్యాత్మ శృంగార సంకీర్తనలు 32 వేలు రచించి ప్రప్రథమ ప్రజాకవిగా, మహావాగ్గేయకారుడుగా, తరువాతి పదకవులకు ఆదర్శప్రాయుడుగా నిరూపించుకొన్నాడు.

సామాన్య ప్రజలకు ప్రబోధించడానికి పద్యం ఉపకరించదు. ఆడి పాడి, ఆనందించి, ఆనందింపజేయడానికి సంగీతసమ్మిళితమైన పదం సహకరిస్తుంది. పదమే, మొదట సంకీర్తన, కీర్తన, కృతి, ఆ వెనుక జావళీగా రూపు దిద్దుకొంది. వీటికి మూలం జానపదమే. సామాన్యప్రజల ఆవేశకావేశాలను, సుఖదుఃఖాలను, వలపుతలపులను వ్యక్తీకరించడానికి పదం ఎంతగానో ఉపకరిస్తుందని అన్నమయ్య గ్రహించాడు. రాగతాళాలతో అనేక పదాలను శ్రీ వేంకటేశ్వరుని గూర్చి రచించి ఆడి పాడుకొన్నాడు. శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించినా, అందులో భక్తి నీతి వైరాగ్యాలను మెదిపి ప్రబోధించాడు. జానపదబాణీలు ఆధారంగా వీటిని కూర్చాడు. ఆనాడు ప్రజల్లో వినవస్తూన్న ఏలలు, జోలలు, లాలలు, తందానతాన పాటలు తత్వాలు మొదలైన అనేక జానపద బాణీలను స్వీకరించాడు. దీనివల్ల మనకవగతమయ్యే విషయం- అన్నమయ్యలో నిస్తులమైన సామాజిక స్పృహ ఉంది అని- జానపదమే గనుక, అతిసామాన్యమైన భాషా, రచన, ప్రయోగం ఉన్నాయనీ, ఉత్తమ కవిశ్రేష్ఠునిలో ఉండవలసిన భావుకత, కృతి చమత్కృతి పదప్రయోగ వైవిధ్యం అన్నమయ్యలో లేవని భావించరాదు; పద్యకవుల కేమాత్రం తీసిపోని, లేదా మించి- అన్నమయ్య కవిత అనన్యసామాన్యమై ఒప్పుతూంది.

ఒక్క ఉదాహరణ :

మూసిన ముత్యానకేలే మొరగులు
ఆసలచిత్తానికేలే అలవోకలు ॥పల్లవి॥

కందులేని మోముకేలే కస్తూరి
చిందునీ కొప్పునకేలే సేమంతులు
మందయానమునకేలే మట్టెలమోత
గందమేలే పైపై కమ్మని నీమేనికి ॥మూసిన॥

భారపు గుబ్బలకేలే పయ్యెద నీ-
బీరపుం జూపులకేలే పెడమోము
జీరల బుజాలకేలే చెమటలు నీ-
గోరింట గోళ్ళకేలే కొనవాండ్లు ॥మూసిన॥

ముద్దులమాటలకేలే ముదములు నీ
యద్దపుఁ జెక్కులకేలే అరవిరి
వొద్దిక మాటలకేలే వూర్పులు నీకు-
నద్దమేలే తిరువేంకటాధీశుఁ గూడి ॥మూసిన॥

(శృం సం. 12- ప. 125)

ఇందులోని భావుకత, ప్రతిభ, పదప్రయోగం, చెప్పినతీరు సహృదయ హృదయైకవేద్యం; మనోహరం; అనితరసాధ్యం.

అన్నమయ్య సామాన్య ప్రజానీకం నోళ్ళలో నలిగే అనేక జానపద బాణీలను గ్రహించాడు. ఆనాటి సమాజంలోని వ్యక్తి, సామాన్య ప్రజల ప్రబోధం ధ్యేయం. కొన్ని ఉదాహరణలు :

జోల :

మన తెలుగు తల్లులందరూ పాడే జోలపాట అన్నమయ్యదేననే భావం ఇటీవలి వరకు తెలియనే తెలియదు.

"జోవచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామగోవింద" (అ.చ.పీ. పు. 61)

ఏల :

ఏలపాటలు యాలపాటలనీ, యాలపదాలనీ మనకు తెలుసు. తెలుగు వాళ్ళకి ముఖ్యంగా కోడెగాళ్ళకీ, కోడెకత్తెలకూ, యాలపదాలు శృంగార సంభరితమై ఆనందాపాది అయి ఒప్పారుతుంటాయి. తాత్వికచింతనాపరమై కూడా ఏలలుంటాయి. సూర్యచంద్రవహ్ని నడుమ శౌర్యమనే చిలుకగంటి, సూర్యదీప్తి గాయుచుండగా ఏగంటిలింగా" ఇది యాగంటివారి ప్రసిద్ధమైన ఏల. శ్రీ వేంకటేశ్వరుని పై బాశిగొన్న నాయిక విరహాన్ని తెలిపే ఏల అన్నమయ్య శృంగార పరినిష్ఠితా విషయ వివరణ సమర్థమైన దీ చక్కటి ఉదాహరణ :

"మేడనెక్కి నిన్నుజూచి కూడేననే యాసతోడ
వాడుదేరి వుస్సురందురా వేంకటేశ
యాడనుంటివిందాకానురా" (శృం. సం. 13-223)

తంపనాన : తదనంతరకాలంలో తత్వకవులకు మార్గదర్శకులుగా తందాన పాటలతో తాత్వికతను ప్రబోధించిన మహనీయుడీ అన్నమయ్య.

"తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి॥

బ్రహ్మమొకటె పరబ్రహ్మమొకటె ఃర
బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే ॥తంద॥

కందువగు హీనాధికములిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకులమంతా నొకటే
అందరికీ శ్రీహరే అంతరాత్మ ॥తంద॥

నిండారురాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటు నిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలుండేటి సరిభూమి యొకటే ॥తంద॥

(అధ్యా. సం. 2-385)

ఇది తత్వమే. తాత్వికాంశాలెన్నో ఉన్నాయి. కులం ఎక్కువ తక్కువలు లేవనీ, రాజు-బంటు; బ్రాహ్మణుడు-చండాలుడు- సమానమని చెప్పిన ఆ మహనీయునిలో ఎంతగా సామాజికత ఉందో విదితమవుతుంది. కులం కన్న గుణం మిన్న అని చెప్పాడు. కులం మానవ కల్పితం.

**కోలాటం :** అన్నమయ్య సంకీర్తనల్లో కోలాటం పాటలూ, వరుసలే గాదు, కోలాటం కోపులూ ఉన్నాయి.

"గోవింద నందనందన గోపాలకృష్ణ నీ
భావము మాకుంజిక్కె గోపాలకృష్ణ ॥పల్లవి॥

కొంగుపట్టినదేమోయి గోపాలకృష్ణ మా
పంగెన కోపుదువా గోపాలకృష్ణ
దొంగతనాల నవ్వేవు గోపాలకృష్ణ
బంగారు కాశితోడ గోపాలకృష్ణ ॥గోవింద॥

కపిలపాట : కపిల తోలేప్పుడు శ్రమ నపనయించుకోడానికి శృంగారం నిండారిన పాటలు పాడుకోవడం సామాన్యవిషయం. అలాంటి కపిల పాటల వరుసల్లో సైతం అన్నమాచార్యులు సంకీర్తన రచన చేశారు.

"భావ మెరుగని పడుచా వోసీ
పోవేపోవేపోవే పడుచా ॥పల్లవి॥

మొరగు మరగు వింతకరగు దేనెల
పరచుమాటల పడుచా
చురుకు మెరుపు వాలుజూపుల కన్నుల
కెరల బొడిచి గిలిగించేవే పడుచా ॥భావ॥

(శృం. సం. 12-269)

**వాకోవాక్యం** : అత్తాకోడళ్ళ సరసం చూడండి.

"రావే కోడల రట్టడికోడల
పోవేపోవే పొందులు నీతో జాలును ॥పల్లవి॥

రంకెలువేయుచు రాజులనెదుట నీవు
కొంకు గొసరు లేనికోడల
పంకజముఖి నీవు పలుదొడ్డవారిండ్ల
అంకెల తిరిగేవు అత్తయ్యా ॥రావే॥

(శృం. సం. 12-313)

ఇంతేగాక స్వామివారి మేలుకొలుపునుంచి పవ్వళింపుసేవదాకా అనేకమైన సంకీర్తనలతో మంగళహారతులతో ముగించే కైంకర్య సేవావిధానం మనం చూడగలం. వీటన్నిటా కవి ఆనాటి సమాజంలోని వ్యక్తి మాత్రమే గాదు, సమాజరీతి రివాజులను చిత్రించిన సామాజికతగల పదకవి అన్నమయ్య అని విదితమవుతుంది.

ఇంక ఆధ్యాత్మికత, భక్తి, నీతి, వైరాగ్య ప్రబోధంలో సామాన్య జన సముదాయాన్ని మేల్కొల్పే వైతాళికుడు, ప్రబోధకుడు అన్నమయ్య. ఇందులో అన్నమయ్య సామాజికస్పృహ స్పష్టమవుతుంది.

ఆధ్యాత్మికతను ప్రబోధిస్తూ ఈ శరీరాన్ని వీణగా, గుడిగా, రథంగా వర్ణించడం గమనించగలము.

భక్తిరీతులను వివరిస్తూ ఈ శరీరం సర్వమూ భగవంతుని సంసేవనం కోసమేనన్న అంశాన్ని నిరూపించాడు అన్నమయ్య.

"ఎన్నడుఁ జెడని యీవులిచ్చీని మాధవుడు
పన్నిన యాసలితని పైపై నిలుపవో ॥పల్లవి॥

కొననాలుకా హరిగుణములే నుడుగవో
మనసా అతని దివ్య మహిమెంచవో
తనువా శ్రీపతి తీర్థదాహమే కోరవో
యెనలేని అడియాస లేటికి నీకికను ॥ఎన్నడు॥

వీనులాల ఏపొద్దు విష్ణుకథలే వినరో
ఆనిన చేతులితని కంది మొక్కరో
కానుక చూపులాల కమలాక్షు జూడరో
యీనేటి పాపాలబారి నేల పడేరికను ॥ఎన్నడు॥

(అధ్యా. సం. 10-14)

వాత్సల్యభక్తికి యశోదామాత మాటలు :

"ముత్తకురే యమ్మలాల ముద్దులాడు వీడే
ముత్తెమువలె నున్నాడు ముద్దులాడు" (శృం. సం. 4-142)

"కానరటె పెంచరటె కటకటా బిడ్డలను
నేను మీవలెనే కంటి నెయ్యమైన బిడ్డని"

ఇందులో మాతృహృదయం విదితమవుతుంది.

నీతిప్రబోధం చేయడం అనేకానేకాంశాల్ని తడివి తనసామాజికస్పృహను వివరించా డీమహనీయుడు.

మానవుడు ద్వంద్వాతీతుడు కావాలన్నాడు.

"ఎండగాని నీడగాని యేమైనాగాని
కొండల రాయడే మా కులదైవము" (అధ్యా. సం. 1-814)

నరుడెంత చదివినా, ఎంతవిన్నా పాపపంకిలంలో పడక శీలవంతుడు కావాలన్నాడు.

"ఎంత చదివిన నేమి వినిన తన
చింత యేలమాను సిరులేల కలుగు" (అధ్యా. సం. 1-62)

పూర్వోక్తమైనట్లుగానే కులం ప్రధానం కాదు గుణం ముఖ్యమంటాడు అన్నమయ్య వేమనలాగానే.

"ఎక్కువ కులజుడైన హీనకులజుడైన
నిక్కమెరిగిన మహానిత్యుడే ఘనుడు" (అధ్యా. సం. 1-318)

"ఏ కులజుడైననేమి ఎవ్వడైననేమి
ఆకడనాతడె హరినెరిగినవాడు" (అధ్యా. సం 1-292)

ఇతరులను విమర్శించడం గాదు ఆత్మవిమర్శ ముఖ్యమని ప్రబోధించాడు.

"చదివితి దొల్లికొంత చదివేనింకాఁ గొంత
మొదిరి నన్నెరగను యెంతైనా నయో" (అధ్యా. సం. 10-74)

వైరాగ్యం : ప్రవృత్తి భోగాలకై మానవుడెంతగా వెంపర్లాడుతాడో అదే రీతిగా వైరాగ్యానికై నివృత్తి భోగాలకూ అంతే, లేదా అంతకంటే ఎక్కువగా పాకులాడవలసి ఉందని అన్నమయ్య ప్రగాఢ ప్రబోధం.

బ్రతకాలన్న మమకారమెంతో బ్రతుకులోని కడగండ్లను అనుభవించాక బతుకుపై రోత ఎంతో వివరించాడు.

"ఎనుపోతుతో నెద్దు నేరుగట్టిన యట్లు
యెనసి ముందర సాగదేటిబ్రదుకు" (అధ్యా సం. 1-156)

ఇలాగే అంతశ్శత్రువుల్ని జయించాలని అలంకారిక రీతిలో చిత్రించిన తీరు ఆయన సమాజాన్ని ఎలా సన్నిహితంగా చూసి చిత్రించాడో అర్థమవుతుంది.

"కాయమనే వూరికి గంతలు తొమ్మిదియాయె
పోయక తిరిగాడేరు పాపపు తలారులు" (అధ్యా. సం. 1-488)

భవబంధాలను తెంచుకొని ముక్తిని పొందాలన్న విషయాన్ని వ్యవసాయంతో పోల్చి మనోజ్ఞంగా వైరాగ్యప్రబోధం చేయడంలో అన్నమయ్య సామాజికత స్పష్టం.

"పంటలభాగ్యులు వీరా బహువ్యవసాయులు
అంటిముట్టి యిట్ల గాపాడుదురు ఘనులు" (అధ్యా. సం. 9-70)
జీవితమొక నాటకమని చాలనైజ రీతిని తెలిపాడు.

"నానాటి బదుకు నాటకము
కానుక కన్నది కైవల్యము" (అధ్యా సం. 9-287)
సంసారభారాన్ని గూర్చి చెప్పాడు.

"సడిబెట్టె గటకటా సంసారము చూడు
జడధి లోపల యీత సంసారము" (అధ్యా. సం. 1-199)

ఇలాగా ఆధ్యాత్మికత భక్తి, నీతి, వైరాగ్యాదుల ప్రబోధంలో అన్నమయ్య సామాజికస్పృహ విదితమవుతుంది.

అన్నమయ్య సమాజంలోని వ్యక్తి గనుక ఆనాటి సామాజిక స్థితిగతుల్ని కళ్ళారాచూసి పాల్గొని చిత్రించాడు.

**పండుగలు పబ్బాలు :** ఉట్ల పండుగ (12-57, 190, 24-29), తెప్పతిరునాళ్ళ (4-6), కోడ తిరునాళ్ళ (24-281), తెప్పోత్సవం (26-534), రథోత్సవం (26-558). వసంతాలాడడం (22-507).

**ఆటలు :** పూర్వోక్తమైన కోలాటం (24-281), తోలుబొమ్మలు (31-253), వామనగుంటలు (27-45), నెత్తమాడడం (27-45,344) బొమ్మపెండ్లి (26-45), చదరంగం (24-91, 27-45), అల్లోనేరేళ్ళ (22-547), మంచం, దోమతెర (22-148, 22-432).

**ఆహార పదార్థాలు :** ఇడ్డెనలు, రాజాన్నాలు, పళ్ళెలు 19-10, 10-27, 88).

మరికొన్ని విశేషాలు :

1. రచ్చరావికింద ఊరిలోని జనం చేరడం (4-103), ఓడవ్యాపారం (9-35, 99), రాట్నం (9-49), తాటియాకు వ్రాయడం (2-290).

2. నాయిక నాయకునకు పావురాలద్వారా లేఖలో పంపడం.

"విచ్చలవిడై మీరు వినోదింతురుగాక
హెచ్చెను తమకములు ఇకనేల జాగులు" (శృం. సం. 28-386)

3. వెట్టి, కూలి (10-207), (9-277).

4. ప్రకృతి పరిశీలన, చీమ, తేనెటీగ, గిజగానిగూడు, ఆ గూటిలో మిణుగురు పురువు దీపం.

"తానెంత బ్రదుకెంత దైవమా నీమాయయెంత
మానవుల లంపటాలు మరిచెప్పగలమా ॥పల్లవి॥
చెలగినేలఁ బారేటి చీమ సయితమును
కలసి వూరకే పారు గమ్మర నెందోమరలు
తలమోచి కాపురము ధాన్యములు గూడబెట్టు
యిలసంసారము దనకిక నెంతగలదో ॥తానెంత॥
యేదో బాయట బారే యీగ సయితమును
వాడుదేర నడవుల వాలివాలి
కూడబెట్టు దేనెలు గొందుల పిల్లల బెట్టు
యేడకేడ సంసారమింక నెంతగలదో ॥తానెంత॥
హెచ్చి గిజిగాండ్లు సయితమెంతో గూడువెట్టు
తెచ్చి మిణుగురు బురువు దీపమువెట్టు
తచ్చి శ్రీవేంకటేశ నీదాసులుచూచి నగుదు
రిచ్చలఁ దానీ సంసారమిక నెంతగలదో ॥తానెంత॥
(అధ్యా. సం. 9-179)

5. కర్షక జీవితం వర్ణితం (4-122), 6. బంతికట్టడం (9-49),
7. నీటి గడియారం (శృం. సం. 24-179, 22-338).

ఇలాగా అన్నమయ్య సంకీర్తనల్లో సామాజికతను సమయోచితంగా, సందర్భానుసారంగా నిరూపించి, తన సామాజికస్పృహను స్పష్టం చేసుకొన్నాడు.

# 7. అన్నమయ్య పదకవితా లక్ష్యలక్షణ సమన్వయం

తెలుగు సాహిత్యంలో పదకవితకు ఒక ప్రత్యేక స్థానముంది. పద్య కవిత నన్నయతో ప్రారంభమై బహుళ ప్రచారం పొంది గౌరవింపబడింది. ఇది కేవలం పండితైకవేద్యం. కాని పండితులచేత అనాదరింపబడి సామాన్య ప్రజల నోళ్ళల్లో నానుతూ బతికి బట్టగట్టిన పదకవితకు అన్నమాచార్యులు జన్మించేదాకా ప్రాముఖ్యం లేకుండాపోయింది. అంతవరకు అనాదృతమయిన ఈపదకవిత సామాన్యప్రజల్లో ఒకప్రక్క కొనసాగుతూఉండగా అన్నమయ్య పద్యకవితను వదలి పదకవితలల్లి దానికి ప్రాముఖ్యాన్ని తెచ్చాడు. అన్నమయ్య పదకవితకు చేసిన సేవ అనన్యసామాన్యమేకాదు అనితరసాధ్యం. ఆయనతో ప్రారంభమైన ఈ పదకవిత మూడుపూవు లారుకాయలై తెలుగు సాహిత్యమంతటా విస్తరించింది. అన్నమయ్య 1408లో జన్మించి 1503 లో దివ్యధామం చేరినట్లు, సంపూర్ణ జీవితమనుభవించినట్లు తెలుస్తుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో ఆ స్వామి సేవకై పదకవితా కుసుమాలను రచించి సమర్పించిన ధన్యజీవి అన్నమయ్య. దినానికొకపదము తక్కువ కాకుండా 32 వేల సంకీర్తనకుసుమాలను రచించి పదసాహిత్యానికి ప్రాముఖ్యం తెచ్చిన ఘనుడు. ఆయనతోపాటు పుత్రపౌత్రులు తదనంతర కాలంలో ఇతర పదకర్తలు ఈపదకవితకు వన్నెచిన్నెలు కూర్చి వయ్యారాలు సమకూర్చిన మహనీయులెందరో. ఏవో కొన్ని శతకాలు తప్ప పద్యకవిత పండితపరమై రాజాస్థానాలలో గౌరవింపబడుతూ వచ్చింది. సామాన్య ప్రజానీకానికి భక్తిపురస్సరముగా రసభావాల అభివ్యక్తీకరణతో ఉత్తేజాన్ని ఉల్లాసాన్ని కలిగించే సంగీత సమ్మేళనంతో పదకవితలు రచించి ప్రజలను చైతన్యవంతులను చేయనారంభించిన మహా పదకవి అన్నమయ్య. సామాన్య ప్రజలకు అర్థమయ్యే రీతిలో అతిసామాన్యమైన తెలుగునుడికారపు సొంపులతో సులభ పద్ధతిలో ఎంత మందబుద్ధినైన రంజింపచేయగల సంగీత సంభరితం చేసి శ్రీ వేంకటేశ్వరస్వామిపై తన భక్తిభావనను తెలియజేస్తూ పదకవిత చెప్పిన మహనీయుడు అమరుడు. అందుకే పదకవితా పితామహుడని, సంకీర్తనాచార్యుడని ఆయనకుగల బిరుదులు సార్థకమైనవి. ఆయన నరులను

ఆశ్రయించలేదు. నారాయణుని తప్ప, రాజులను ఆశ్రయించలేదు, రాజులకు రాజయిన భగవంతుని తప్ప. అది ఆయన వ్యక్తిగతమే అయినా ఉద్ధురితమై, మహానదిలా ప్రవహిస్తూఉన్న పద్యకవితనుకాక మధురమై శ్రవఃపేయమైవిన్న వెంటనే ఆనందాన్నిచ్చే మధురకవితలైన పదకవితల నల్లి తెలుగుసాహిత్యాన్నే ఒక్క మలుపు తిప్పాడు. తనకు ముందు తన కాలంలోను ప్రచారంలో ఉన్న జానపద గేయరీతుల నెన్నింటినో స్వీకరించి తన పదకవితలో స్థానం కల్పించిన ఘనత అన్నమయ్యదే. అందువల్లనే సామాన్యభాషలో అందరికి సులభమైన భక్తిభావనతో రమణీయమైన పదకవితా రచనచేసి ప్రాముఖ్యం తెచ్చి పదకవితా పితామహుడయ్యాడు. ఇది అన్నమయ్య పదకవితా ప్రయోజనం, విశిష్టతాను.

మనకు లభించినంతలో అన్నమయ్య పదకవితలే మొదటివి. అంతకు ముందు కృష్ణమాచార్యుల సింహగిరి వచనములుండేవి. ఆ వచనాలు పాడుకోవడానికి ఉపకరించేవి. కాని అవి అనిబద్ధ రచనలు. రెండవరకమైన ద్విపదలు పాల్కురికి సోమనాథుని దగ్గరనుండి సుప్రసిద్ధమే. నిబద్ధపదమైన పదకవిత అన్నమయ్యతో ప్రారంభమైనది. పద్యకవితతో సమానమైన గౌరవం ఈ పదకవితకు తెచ్చిపెట్టిన ఘనత అన్నమయ్యదే.

పదమంటే ఏమిటో, నిర్వచనమేమిటో, లక్షణమెలాంటిదో తెలుసుకునే ముందు పదకవి లేదా పదకర్త లేదా వాగ్గేయకారుడంటే ఏమిటో సంక్షిప్తంగా తెలుసుకోవడమవసరం.

"తాళ్ళపాకవారి కాలమున సంకీర్తనమునకే పదమనియు వ్యవహారము. దానికే గేయమనియు నేటి వ్యవహారము. కృాత సంశబ్దనే- కీర్తించునది కీర్తనము. సమ్యక్ కీర్తనము పాడబడునది గీతము లేదా గేయము. కాగా అవాఙ్మానస గోచరమగు దివ్యశక్తిని కీర్తించి పాడునది కీర్తనము లేక సంకీర్తనమైనది. ఇట్లు గేయమానమగు కీర్తనయే భక్తుని హృదయమును పరమాత్మని పాదసన్నిధికి గొంపోవునది. 'పదగతౌ' అని అమరము. అందువలన అట్లు తీసుకొనిపోవునదే పదమనియు రూఢికెక్కినది. ఇట్లు నాడు కీర్తనము, పదము అనబరిగిన రచన సంగీత సాహిత్యముల సమ్మేళన రూపము. ప్రాచీన లాక్షణికులందలి సాహిత్యాంశమును వాక్ అనియు సంగీతాంశమును గేయమనియు వ్యవహరించిరి. వీనికే క్రమముగా మాతు

ధాతు సంజ్ఞలు కూడా కలవు." పదంలోని మాతు లేక వాక్కు సాహిత్యాన్నీ, ధాతు లేక గేయాన్ని- సంగీతాన్ని రచన చేయగలవాడు వాగ్గేయకారుడు. శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలో వాగ్గేయకారుని గూర్చి నిర్వచించిన వాటిని రజనీకాంతరావుగారు విపులంగా వివరించారు.[2]

'ఖాజ్మాతు రుచ్యతే గేయం ధాతురిత్యభిదీయతే
వాచ్యం గేయం చ కురుతేయః సవాగ్గేయకారః'

కాగా వాగ్గేయకార లక్షణాలీవిధంగా చెప్పబడ్డాయి.

"శబ్దానుశాసన జ్ఞాన మభిదాన ప్రవీణత
ఛన్దః ప్రభేద వేదిత్వ మలంకారేషు కౌశలమ్"

ఈ వాగ్గేయకార లక్షణాలు ఉత్తమ కవికుండవలసిన లక్షణాలకు ఏమాత్రమూ తీసిపోవనీ, పైపెచ్చు కవికంటే ఉత్తమ వాగ్గేయకారునిలో సంగీతాది కళల్లో పరిజ్ఞానముండాలని స్పష్టమవుతుంది.

పదనిర్వచనం, లక్షణం మొదలైన అంశాలివి.

తెలుగులో మొట్టమొదటిసారి సంకీర్తన సముచ్చయాన్ని ప్రసాదించిన అన్నమాచార్యులు 'సంకీర్తన లక్షణం' సంస్కృతంలో రచించి ఉండడం విశేషం. అది ఈనాడు ఉపలభ్యమానం కావడంలేదు. కాని అన్నమాచార్యుల మనుమడు చినతిరుమలాచార్యుల అనువాదం మనకు లభిస్తూ ఉంది. మొట్ట మొదట భరతుడే ఈ పదలక్షణాన్ని వివరించాడు. వాటిని మొదట తెలుసుకుని అన్నమాచార్యుల పదలక్షణాన్ని పరిశీలిద్దాము.

భరతముని పదనిరచ్వనం ఇలా ఉంది-

"గాంధర్వం యన్మయాప్రోక్తం స్వరతాళ పదాత్మకమ్
....................నిబద్ధం తచ్చవై స్మృతమ్"[3]

స్వరతాళ పదాత్మకమైంది గాంధర్వమని స్వరతాళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది పదమని, ఈ పదం నిబద్ధం, అనిబద్ధం అని రెండు విధాలనీ, అవి అతాలము సతాలములని రెండువిధాలని భరతుని నిర్వచనం. "నియతాక్షర సంబంధము కలిగి, ఛందోయతి సమన్వితమై తాలపాతములతో కూడిన పదము నిబద్ధమనబడును. యతిపాద నియమము లేనిదియును, అనియతాక్షరమును అగు పదము అనిబద్ధ మన

బడును.[4] "దేశీయ వ్యవహారములలోని దరువునుంచి ధ్రువ పదమనే లక్షణ నామం గాని, ధ్రువపదం నుంచి దరువు అనే వ్యవహారం గాని వచ్చిఉండ వచ్చునని ప్రాజ్ఞుల అభిప్రాయం.[5] సంగీత పరిభాషలో ఈ పదాలు ప్రబంధా లనబడతాయి. పైని భరతముని చెప్పినవిధంగానే మతంగుడు శార్ఙ్గదేవుడు చివరికి వేంకటమఖి వరకు అందరూ లక్షణాల్ని వివరించారు.

పదకవితా పితామహుడని ప్రసిద్ధిగాంచి వేలకొలది పదాల రచనచేసిన అన్నమాచార్యుడే సంస్కృతంలో సంకీర్తనలక్షణం సైతం రచించాడని ఇంతకుముందే తెలుసుకున్నాం. దానికి పెద తిరుమలాచార్యుడు లఘువ్యాఖ్య కూర్చినట్లు తెలుస్తుంది. కాని ఈ రెండు మనకు లభింపటం లేదు. అన్నమా చార్యుల పౌత్రుడు చిన తిరుమలాచార్యుడు తాతగారి సంకీర్తన లక్షణాన్ని అదేపేరుతో తెలుగులోని కనువదించిన గ్రంథం లభిస్తుంది. అందులో పద లక్షణాల్ని భరతాదులు చెప్పిన రీతిలోనే వివరించి ఉండడం విశేషం. ఆ వివరణ విశేషాలు తెలుసుకునే ముందు తాతగారి పదాల విశిష్టతను వివ రించిన తీరును గమనించడం అవసరం.

క. పావనములు హరిభక్తి వి
భావనములు సర్వమంత్ర పరమ రహస్యో
ద్భావనములు గాయకనిక
రావనములు తాళ్ళపాక యన్నయ పదముల్

క. రంజనములు దుర్గుణ గణ
భంజనములు విమల కమల భవజనక గుణా
సంజనములు సంజ్ఞాన ధ
నాంజనములు తాళ్ళపాక యన్నయ పదముల్.

క. వేదంబులు పౌరాణిక
వాదంబులు వరకవిత్వ వాణీ వీణా
నాదంబులు కృత సుజనా
హ్లాదంబులు తాళ్ళపాక యన్నయ పదముల్.

క. లక్షణములు పదకవితా
రక్షణములు వివిధ కుకవిరాజీమదసం
మోక్షణములు వేంకటపతి
వీక్షణములు తాళ్ళపాక విభు సత్కవితల్.

మ. శ్రుతులై, శాస్త్రములై, పురాణకథలై, సుజ్ఞానసారంబులై
యతిలోకాగమ వీధులై వివిధ మంత్రార్థంబులై, నీతులై
కృతులై వేంకట శైలవల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళ్ళపాక యన్నయ వచో నూత్నక్రియల్ చెన్నగున్.
(సంకీర్తన లక్షణము - పద్యాలు 3,4,6,7,12)

ఇలా విశిష్టమైన అన్నమాచార్యుని పదాలగూర్చి తెలుసుకున్నాక చిన తిరుమలాచార్యుడు వివరించిన పదలక్షణాలను తెలుసుకొందాం. పదప్రామాణికము చిన తిరుమలాచార్యుడు పేర్కొని కీర్తించిన తీరు యిది.

రమణీయ సంగీత రత్నాకర ప్రబం
ధా ధ్యాయమున నుక్తమయ్యెఁ బదము
సముచిత సంగీత చంద్రికా దేశైశ
మందు మిక్కలి దేటమయ్యెఁ బదము

అతుల తత్సంవాదమైనట్టి సంగీత
చూడామణికిఁ బల్కుచోటు పదము
ధన్య సంగీత సుధాకర గ్రంథంబు
నందు మిక్కలిఁ జెలువొందుఁ బదము.

తానె యిన్నిటికి మూలమైన భరత
మందుఁబంచ దశాధ్యాయ మందు విమల
వృత్తచూర్ణ నిబంధక వివిధనామ
భవ్యలక్షణములకు నాస్పదము పదము.

—ఇందులో పదనిర్వచనం సైతం స్పష్టంగా ఉంది.

"పదమగు సుప్తిఙ్గన్తము
పదమవయవ యవయవియును బదమన బరగున్
తుది నీ తెఱంగులన్నియు
బదకవితామార్గ సార్వభౌముడు దెలిపెన్"

ఇందులో అవయవ పదం చతుష్పాదం. వృత్త ధాతు అవయవాలలో పాటించబడుతుంది. ఈ పదాలు శృంగార వైరాగ్యపదాలని ద్వివిధం. ఈ శృంగార పదాలు గ్రామ్యోక్తులతో ఉండవచ్చును.

"పదములు శృంగార వధూ
మృదుమధుర మనోజ్ఞవాక్య మిశ్రములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు
పదిలముగాఁ బొంకమెరిగి పలుకగ జెల్లున్"

"పల్లవ నారీ మ్లేచ్ఛా
ద్యుల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవియై
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసక ముఖ్యనాటకాదిక ఫణితిన్"

అయితే వైరాగ్య పదాలు అలాగాక ఉదాత్తంగా ఉండడం ఆవసరం.

వైరాగ్య వృద్ధికర గం
భీర పదశ్రేణి పొసగఁ బెనుపుచు సగ్రా
మ్యా రమ్య విష్ణుచరితో
దారములై యున్నఁ జాలు ధరణి న్వెలయున్.

—వీటినే అధ్యాత్మ పదాలంటారు. ఈ పదాలు సంస్కృత, ప్రాకృత దేశ భాషల్లో చెప్పవచ్చు. వీటికి పద్యాల్లాగా యతిప్రాసలు వర్తిస్తాయని భరతాదుల మతం. ఈ పదాలు వృత్త, నిబంధ, అనిబంధాలని మూడువిధాలు. ఈనిబంధ పదంలో నాలుగుపాదాల చరణమొక్కటిగాని అంతకుమించిగాని ఉండవచ్చు ఇలాంటి చరణాల అర్థాన్ని వదలక అన్నిటికీ ఏక వాక్యతతో గుదిగ్రుచ్చినట్లు మరల మరలా భాసిల్లునట్టి పల్లవి ఉంటుంది. ఇది పల్లవి, శిఖాపదమని ద్వివిధం. పదసమాన మాన పాదయుగ్మము కలది పల్లవి. అందులో సగం ఏకపాదం గలది శిఖాపదం. ఈ నిబంధపదంలో పల్లవి ఉంటే శిఖాపద ముండదు. శిఖాపదముంటే పల్లవి ఉండదు. ఇలాంటి పల్లవి శిఖాపదాలతో గూడిన నిబంధపదం చతుర్ధాతుక, 'త్రిధాతుక, ద్విధాతుక, ఏకధాతుకాలని చతుర్విధం.'

కాని ఏకధాతు పదం అరుదుగా ప్రయుక్తమవుతుంది. వృత్తాలు నాలుగు పాదాలతోనూ, జాతులు రెండుపాదాలతోనూ ఉన్నట్లే సంకీర్తనలు కూడా చతుష్పాద, ద్విపాదాకృతితో ఉంటాయి. ఇట్టి కీర్తనలలో దరువు, వాక్యం, అర్ధచంద్రిక, ఏల, గొబ్బిళ్ళు, చందమామ పదాలు అనేవి రెండు పాదాలతో ఉంటాయి. ఇవిగాక అష్టపది, పదమాలిక, శరభపాద పదం అనే పదవిశేషా

లున్నాయి. ఇంక అనిబంధపదం అంటే అనిర్వ్యక్తపదం. ఇది తాళ బంధ చ్ఛందోవిరహితమై చూర్ణాఖ్యతో ఉంటుంది. దీనిని తాళగంధి అనికూడా అంటారు. ఇది సూక్ష్మంగా అన్నమయ్య సంప్కృతంలో చెప్పిన సంకీర్తన లక్షణం. దీనికి లక్ష్యంగా వేలసంఖ్యలో అతడు రచించాడు సంకీర్తనలు.[6]

అన్నమయ్య సంకీర్తనల్ని పరిశీలించినప్పుడు స్థూలంగా శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలుదర్శనమిస్తాయి. మృదుమధురవాక్య మనోజ్ఞమిశ్రములై అక్కడక్కడ గ్రామ్యోక్తులతో ఉంటాయి. అన్నమయ్య రచించిన ఒకశృంగార సంకీర్తనను ఈ విధంగా గమనించవచ్చు.

"విరహ మొక్కంద మాయ విచ్చేయవయ్యా
నిరతి నాకెఁజూచి నీవంటా మొక్కితిమి ॥పల్లవి॥

చెక్కిటి చెయ్యే చెలికి శేష పరియంక మాయ
జక్కవ చన్నులు శంఖచక్రము లాయ
వుక్క చెమటే జలధి వునికి సేసుకనిన్ను
జక్కని సతి దలఁచి సారూప్యమందె ॥విరహ॥

(26-191)

—ఈ కీర్తనలో కమనీయ కవిత ఉంది. ఆ కవితకు తగిన చక్కటి భాష ఉంది. విరహ వ్యథాభరిత అయిన నాయిక సర్వవిధాలా శ్రీ వేంకటేశ్వరుని లాగానే అయి సారూప్యమందిందట. ఈ విరహం నాయికకు ఒక అందాన్ని కూర్చిందట. అసారూప్యమందిన నాయికనే నాయకుడుగా చెలులు భావించారు. ఇంతేకాకుండా 'శేషపరియంక మాయ, శంఖచక్రములాయ' అని వ్యావహారిక భాషలో ఉండటం వల్ల సంకీర్తన మనోహరంగా సాగినట్లు చెప్పవచ్చు. "ఆయెను" అంటే అంతటి స్ఫూర్తి వచ్చేదికాదని గుర్తించాలి.

అన్నమయ్య రచించిన ఆధ్యాత్మిక సంకీర్తనలు అగ్రామ్య రమ్యమైన భాషతో విష్ణువుయొక్క ఉదాత్తమైన గుణాల వర్ణనలతో అలరారుతూ ఉంటాయి.

"ఎంత చదివి చూచిన నీతఁడే ఘనముగాక
యింతయు నేలేటి దైవమిఁక వేరేకలదా ॥పల్లవి॥

మొదల జగములకు మూలమైనవాడు
తుదఁ బ్రళయమునాడు తోఁచేవాఁడు
కదిసి నడుమ నిండి కలిగి వుండెడివాఁడు
మదన గురుఁడే గాక మఱి వేరే కలరా ॥ఎంత॥

పరమాణువైనవాడు బ్రహ్మాండమైనవాడు
సురలకు నరులకుఁ జోటయినవాడు
పరమైనవాడు ప్రపంచమైనవాడు
హరియొక్కఁడే గాక అవ్వలనుఁ గలరా ॥ఎంత॥

పుట్టుగులయినవాడు భోగమోక్షాలైనవాడు
యెట్టు యెదుర లోనను యిన్నిటివాడు
గట్టిగా శ్రీవేంకటాద్రి కమలాదేవితోడి
పట్టపుదేవుఁడే కాక పరులకఁగలరా ॥ఎంత॥

(2-98)

—విష్ణువుయొక్క గొప్పతనాన్ని వర్ణిస్తూ సమస్త జగత్తుకూ అధినాయకుడు వేంకటాద్రి దేవుడే అని సరళమైన, రమ్యమైన భాషలో అన్నమయ్య వెల్లడించాడు.

అన్నమయ్య సంకీర్తనల్లో ఎక్కువగా ముందు రెండుపాదాల పల్లవి ఆ తర్వాత నాలుగు పాదాలతో కూడిన మూడు చరణాలు ఉంటాయి. కొన్ని సంకీర్తనల్లో మార్పు అక్కడక్కడా కనిపిస్తుంది. ఏకపాద పల్లవులు కూడా కొన్ని కనిపిస్తాయి. ఏకపాద పల్లవిని శిఖాపదం అంటారు. మిగిలినచరణాల్లో 2, 3, 4 పాదాలు ఉండటాన్ని గమనించవచ్చు.

శిఖాపదం :

"గుజ్జరి : జగమంతా నీమయము సర్వం విష్ణుమయంబుగాన ॥పల్లవి॥
యెనయుచునేఁ గర్మమార్గముల నితరదేవతల భజియించెదను
అని యపరాధంబెంచకుమీ అన్యము నీకంటె మరిలేదు
పనివడి 'మత్తః పరతరం' బనిపలికితి ఎన్నియు నీయాజ్ఞలు ॥జగ॥
(2-381)

—అంటూ ఈ సంకీర్తనం ఒకే పాదం ఉన్న పల్లవితో మూడు పాదాలు ఉన్న మూడు చరణాలతో సాగింది. అన్నమయ్య రచించిన కొన్ని సంకీర్తనల్లో శిఖాపదము, పల్లవి అని చెప్పదగిన రీతిలో ఒక పాదం శిఖాపదంగాను రెండుపాదాలు పల్లవిగాను రచించబడటాన్ని గుర్తించవచ్చు. ఈ శిఖాపదం, పల్లవి అనేవే తర్వాతికాలపు పదకర్తల రచనల్లో పల్లవి అనుపల్లవి అనేరీతిలో మారి ఉండవచ్చునని ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారి అభిప్రాయం.[7]

తాళ్ళపాకవారి కాలానికే పదాన్ని పాడటంలో ముందు చరణం (ఉద్గ్రాహ భాగం) పాడి తర్వాత పల్లవి (ధ్రువం) అందుకొనే సంప్రదాయం ఉన్నదని చెప్పవచ్చు. అచ్చులో పల్లవి- చరణం అనేరీతిలో ఉన్నా పాడటం మాత్రం చరణం పల్లవి అనే రీతిలో సాగిందని చెప్పటానికి కొన్ని సంకీర్తనలు సాక్ష్యంగా నిలుస్తాయి. తాళ్ళపాకవారి పదాలు తంజావూరులోని తాళపత్ర ప్రతిలో ఈ విధంగానే (చరణం ముందు, పల్లవి తర్వాత) వ్రాయబడినట్లు ఆనందమూర్తిగారు తెలిపారు.[8]

చరణం ముందు పల్లవి తర్వాత పాడే సంప్రదాయం ఉందని చెప్పటానికి అన్నమయ్య రచించిన ఈ సంకీర్తనను గమనించినప్పుడు స్పష్టమవుతుంది.

రామక్రియ :

అనుచు నిద్దరు నాడే రమడల వలెనే
మొనసి యివెల్లాఁ జూచి మ్రొక్కిరి బ్రహ్మాదులు ॥పల్లవి॥

రాముడ పండ్లు నాకు రండు వెట్టరా
యేమిరా యిట్లానె నాకు యిత్తువా నీవు
ప్రేమపు తమ్ముడగాన పిన్ననే నీకు
యీమాట మఱవకు యిందరా కృష్ణుడా ॥అను ప.॥

(2-14)

—బలరామకృష్ణుల బాల్యక్రీడల్ని ఈ సంకీర్తనలో అన్నమయ్య అద్భుతంగా వర్ణించాడు. చరణం పాడిన తర్వాత పల్లవి పాడితేనే ఈ సంకీర్తన సముచితంగా సాగుతుంది. లేకపోతే 'అనుచు'అని సంకీర్తన ప్రారంభం కావటంలో అర్థం ఉండదు.

ఇలాగే "అనుచు లోకములెల్ల నదె జయవెట్టేరు
నినుఁ గొల్చితి గావవే నీరజాక్షుడా" (2-111)

-అని సాగిన సంకీర్తన కూడా ఇలాంటిదేనని చెప్పవచ్చు.

పదాలు వృత్త, నిబంధ, అనుబంధ పదాలని పూర్వోక్తం. వృత్తిపదం విషమపదం, సమపదం, అర్థసమపదం అని మూడువిధాలుగా ఉంటుంది.

విషమం : పదంలోని చరణాల్లోని నాలుగుపాదాలు నాలుగువిధాలుగా ఉంటాయి. అంటే ఒక్కొక్కపాదం ఒక్కోరకంగా ఉంటుందని భావించవచ్చు. దీనికి అన్నమయ్య కీర్తనల్లో చాలా ఉదాహరణలు చూపవచ్చు.

"యేనుగ దలచితే యేనుగై పొడచూపు
మానుదలచినట్టే మానై పొడచూపు
పూని పెద్దకొండ తలపోయఁ గొండై పొడచూపు
తానే మనోగోచరుడు దైవమేసుండీ" 112-141

-ఈ చరణంలో ఒక్కోపాదం ఒక్కోరీతిలో సాగింది. ఈ చరణంలోని ప్రతిపాదం భిన్నమాత్రలతో, భిన్నరీతిలో సాగింది.

సమపాదం : చరణంలోని నాలుగు పాదాలు ఒక్కరీతిలో సాగుతాయి. ఇలాంటివి అన్నమయ్య సంకీర్తనల్లో అరుదుగా ఉన్నాయి.

"హరినిజనిలయం బహోబలం
హరివిరించి నుత మహోబలం
అరుణమణి శిఖరమహోబలం
అరిదైత్యహరణ మహోబలం (3-520)

-అని సాగిన ఈ సంకీర్తనంలోని ఈ చరణంలో అన్ని పాదాలు ఒకేరీతిలో ఉండి సమపాదానికి సాక్ష్యంగా నిలుస్తున్నాయి.

అర్ధసమపాదం : చరణంలోని విషమపాదాలు ఒకరకంగా సమపాదాలు మరోరీతిగా ప్రవర్తిల్లడాన్ని అర్ధసమంగా చెప్పవచ్చు. ఇలాంటివి అన్నమయ్య కీర్తనల్లో అధికంగా ఉన్నాయి.

"చిడుముడి మూగిన జీవుల లోపల
కడగి నేనొక్కడ నింతే
విడువక పక్షులు వృక్షములిలపై
వెడగు భోగములు వెదకీనా" (2-71)

—లోకవృత్త పరిశీలనతో, భంగ్యంతర ప్రబోధంతో సాగిన ఈ అర్ధసమపదం అన్నమయ్య ప్రతిభకు నిదర్శనం.

దరువు : "ద్రుతమధ్యమానములు, చిత్రవర్ణము తాళము కలిగి మునుపు పాడిన పదవాక్యముల బోసంగి ద్వి చతుష్పదాకృతితోఁ జెలగును"[9]

"భైరవి : కూరి మెరగి కైకోవు- నీ
బీరములే నెరపేవు ॥పల్లవి॥

....................

హొలయుచు నూరకెపోవు
గిలిగింపుచుఁ ఉరిగేవు
చెలఁగుచు వడి మురిసేవు
నిలదా యించు నీవు ॥కూరి॥ (12-310)

—ఇది నాలుగు పాదాలతో ఉండి ద్రుతమానం, చిత్రవర్ణ తాళాలతో గల దరువును బోలిన రచన అనవచ్చు. తర్వాతి కాలంలో యక్షగానాల్లో ఇలాంటి రచనలే కనిపిస్తాయి.

వాక్యం: "తానాంచితమై, విలంబమానమై, తాళవిరహితమై పదార్థంబు చెంది కేవల ద్విచతుష్పదాకృతినిఁ జెలగును."[10] భాసుర వాక్యానికి ఉదాహరణగా అన్నమాచార్యుడు రచించిన ఈ సంకీర్తనను గుర్తించవచ్చు.

"సజ్జరి : కలదిదివో సుఖము గలిగినను గర్వము నిలువక మానునా
మలసి కామ్య కర్మములకుఁ జొచ్చిన మగుడఁ బుట్టువులుమానునా"
॥పల్లవి॥

పరగ నింద్రజిత్తుఁడు హనుమంతుని బ్రహ్మాస్త్రమునఁగట్టి
అరయ నందుపై మోకులు గట్టిన నల బ్రహ్మాస్త్రము వదలె
పరిపరి విధముల నటువలెనే హరిఁ బ్రపత్తి నమ్మిన నరుడు
తిరుగఁ గర్మమార్గమునకుఁ జొచ్చిన దేవుడు దన వాత్సల్యమువదలు
॥కల॥"

అని సాగిన ఈసంకీర్తన భాసురవాక్యంగా భావించవచ్చు. ఇది తానాంచితమై, విలంబమానమై, తాళవిరహితమై యున్నట్లున్నది.

అర్ధచంద్రిక పదము : "ఉద్గ్రాహము, ధ్రువము, ఆభోగము సగమె పలికి పల్లవము సంధించి- తాన ప్రతాన కాంచితమగునది అర్ధచంద్రిక పదానికి ఉదాహరణం.

"శ్రీరాగం : అతి శోభితే యం రాధా
సతత విలాస వశా రాధా ॥పల్లవి॥

..............................

తను భవ గురు గధా రాధా
స్తన కృత గిరి రోధా రాధా
తను వర వచన సుధా రాధా
ధ్వని జిత పిక మేధా రాధా ॥అతి॥ (4-48)

—ఇంతేకాకుండా "బలువగు తన రూపము చూపెన్
కలదింతయు తన ఘనతెలిగించెన్" (1-295)

అనే సంకీర్తనలోని రచనారీతిని గమనించవచ్చు.

ఏలపాట : నాయకాహ్వాన పూర్వమై, మ్లేచ్ఛ పరిభాషతో రాగమిశ్రితమై ఉంటుంది. మధ్యమధ్యలో నాయకుని సంబోధన ఉంటుంది. ఏలలు శృంగారాత్మకాలై ఉంటాయి. వీటినే యాలపాటలనీ, యాలపదాలనీ అంటారు.

శ్రీ వేంకటేశ్వరునిమీద మనసుపడ్డ నాయిక విరహాన్ని తెలిపే ఏల అన్నమయ్య రచనల్లో ప్రసిద్ధమై దీర్ఘంగా సాగుతుంది.

"మేడలెక్కి నిన్ను జూచి
కూడే ననే యాసతోడ
వాడుదేరి ఉస్సురందురా వేంకటేశ
యాడనుంటి విందాకానురా ॥మేడ॥

పిక్కటిల్లు చన్నులపై చొక్కపు నీ వుంగరము
గక్కన నేనద్దు కొందురా వేంకటేశ
లక్కలవలె ముద్రలంటెరా ॥మేడ॥

(13-223)

—అని ఎంతో మనోజ్ఞంగా సాగుతుందీ ఏలపాట.

గొబ్బిళ్ళు : ఈ గొబ్బి పాటలు సంక్రాంతి సందర్భంలో స్త్రీలందరూ వయోభేదం లేకుండా ఆడుతూ పాడేపాటలు. తెలంగాణాలోని బొడ్డెమ్మ, బతుకమ్మ పాటల్లాంటివి. పేడతో 'గొబ్బెమ్మ'ను పెట్టి చుట్టూ తిరుగుతూ ఈ గొబ్బి పాటలు పాడతారు. దీనికి లక్షణం సంకీర్తన లక్షణంలో ఎందుకో కనిపించదు.

"కొలని దోపరికి గొబ్బిళ్ళో యదు-
కులస్వామికి గొబ్బిళ్ళో ॥పల్లవి॥
కొండ గొడుగుగా గోవుల గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్ళో
దుండగపు దైత్యుల కెల్లను తల-
గుండు గండనికి గొబ్బిళ్ళో ॥కొలని॥ (12-08)

-ఈ విధంగా శ్రీకృష్ణుని లీలావిలాసాలను వర్ణిస్తూ ఈగొబ్బిపాట సాగుతుంది.

చందమామ పదం : విప్రలంభంలో నాయకుడుగానీ, నాయికగాని పాదపాదంలో చంద్రుని పేర్కొంటూ సాగే రచన ఇది,

"చల్లనై కాయగదో చందమామా నీ
వెల్లగా తిరువేంకటేశు నెదుర....
మొల్లమిగ నమృతంబు వెల్లి గొలుపుచు- లోక
మెల్ల నిను గొనియాడగాను" (12-228)

—ఇలా సాగుతుంది అన్నమయ్య చందమామ పదం.

ఇవేకాకుండా పదవిశేషాలుగా తాళ్ళపాకవారు పేర్కొన్న ఇతర పద రీతులకు కూడా తాళ్ళపాకవారి సంకీర్తనలు ఉదాహరణ యోగ్యాలై ఉన్నాయి. అష్టపదులు, పదమాలికలు, శరభపాదాలు మొదలైన రీతిలో ఇవి ఉన్నాయి.

అష్టపదులు : అన్నమయ్య సంకీర్తనల్లో నాలుగు పాదాల పల్లవి ఎనిమిది పాదాల చరణాలతో కూడిన జయదేవుని అష్టపదుల లాంటివి కొన్ని ఉండగా, పల్లవి రెండుపాదాలతో చరణాలు ఎనిమిది పాదాలతో సాగినవి కొన్ని ఉన్నాయి.

నాలుగు పాదాల పల్లవి ఎనిమిది పాదాల చరణాలతో సాగిన రచన ఈ విధంగా ఉన్నది.

"గుండక్రియ : హరి గోవిందా హరి గోవిందా
ఆనంద మానంద మాతుమకును
గురూపదేశాన వెదకఁగా వెదకఁగా
గరిమ నీ యర్థము కంటిమో యయ్యా ॥పల్లవి॥

సరి నన్యధర్మములు మానుమంటివి
శరణు నీకు జొరుమంటివి
దురితము లణచేనంటివి
పరగ మోక్షం బిచ్చే నంటివి
హరి నీ వచనము అమోఘము
నరులము నేమిది నమ్మితిమి
పరమపదమిప్పుడే కలిగెను
ధరనొక్క మనసుతో నున్నారమయ్యా ॥హరి॥ (2-339)

—ఇలాంటి రచనలే 1-67లో కూడా ఉన్నది.

ఇంకా "జీవాత్ముమై యుండు చిలుకా నీ
వావలికి పరమాత్ముడై యుండు చిలుకా" (1-50)

—అని రెండు పాదాల పల్లవితో ఎనిమిది పాదాల చరణాలతో సాగిన అష్ట పదిని కూడా గమనించవచ్చు. ఇలాంటిదే 12-177 సంకీర్తన.

**పదమాలికలు :** అన్నమయ్య సంకీర్తనల్లో సాధారణంగా పల్లవిలో రెండు పాదాలు ఆ తర్వాత మూడు చరణాల్లో నాలుగు పాదాలు ఉంటాయి. ఇలా కాకుండా పల్లవి రెండు పాదాలతోను మూడుకంటే ఎక్కువ చరణాలు నాలుగు పాదాలతో సాగిన సంకీర్తనలు కూడా ఉన్నాయి. వీటిని పదమాలిక లుగా చెప్పవచ్చు.

"సామంతం : ఒద్దేల మొక్కేవో వుద్ధవుడా తన
ఉద్దండాలె చెల్లె నుద్ధవుడా ॥పల్లవి॥

ఊరూరా వలపు లుద్ధవుడా నే
మోరుతుమో యిక నుద్ధవుడా
ఊరడించ వచ్చేవు వుద్ధవుడా తన
వూరట చెలుము లుద్ధవుడా ॥ఒద్దే॥ (12-56

–అని సాగిన ఈ పదమాలికలో ఐదు చరణాలున్నాయి. ఇంతేకాకుండా 12-378లో ఏడుచరణాలు. 12-374లో 11 చరణాలు ఉన్నాయి. వీటిని పదమాలికలుగా గుర్తించవచ్చు. అన్నమయ్య కీర్తనల్లో శరభపాదం కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. దీనిలో చరణాలు నాలుగుపాదాలతో సాగినా యతులు ప్రతిపాదంలోను నాలుగుచోట్ల ఉండటంవల్ల వాటినే విరిచి ఎనిమిది పాదాలు కలిసిన పదంగా దీన్ని ఉదాహరించవచ్చు.

ఈ విధంగా అన్నమాచార్యుడు 'సంకీర్తన లక్షణము' రచించటమే కాకుండా ఆ గ్రంథంలో చెప్పబడిన వివిధ పదభేదాలకు లక్ష్యాలను కూడా రచించి లక్ష్యలక్షణ సమన్వయ కర్తగా ప్రసిద్ధిపొందినట్లు గమనించవచ్చు. సంకీర్తన లక్షణంలో వివరించబడిన కొన్ని పదభేదాలకు ఈ వ్యాసంలో స్థూలంగా లక్ష్యాలు చూపబడ్డాయి. ఈ విషయాన్ని ఇంకా విస్తృతంగా పరిశీలించవలసిన అవసరం ఉంది.

## సూచికలు


1. రజనీకాంతరావు, బాలాంత్రపు — ఆంధ్రవాగ్గేయకార చరిత్రము పు. 48-55.
2. ,, ,, — పు. 23, 34, 37, 53.
3. భరతముని — నాట్యశాస్త్రము అధ్యా : 32 శ్లో. 25-47.
4. అప్పారావు, పి.ఎస్.ఆర్. — నాట్యశాస్త్రం అధ్యా. : 32 పు. 809.
5. రజనీకాంతరావు, బాలాంత్రపు — ఆంధ్రవాగ్గేయకార చరిత్రము పు. 56, 57.
6. డా॥ వేటూరి ఆనందమూర్తి — తెలుగు సంకీర్తన లక్షణము- లక్ష్యలక్షణ సమన్వయము భారతి - ఆగస్టు 1971 పు. 5, 9.

7&8 డా॥ వేటూరి ఆనందమూర్తి — తాళ్ళపాక కవుల కృతులు- వివిధ సాహితీ ప్రక్రియలు- పుట. 449, 451

9. డా॥ వేటూరి ఆనందమూర్తి తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు పుట. 441
10. ,, ,, ,, పుట. 441
11. ,, ,, ,, పుట. 441

ఉపకరించిన ఇతర గ్రంథాలు :

1. గంగప్ప ఎస్. క్షేత్రయ్య పదసాహిత్యం - 1977.
2. ,, ,, సారంగపాణి పదసాహిత్యం, 1980.
3. ,, ,, తెలుగులో పదకవిత - 1984.
4. ,, ,, అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు తులనాత్మక అధ్యయనం - 1992.
5. గంగప్ప ఎస్. పదసాహిత్య పరిమళం - 1994.
6. ,, ,, అన్నమాచార్య సంకీర్తల సుధ - 1995.



# అన్నమాచార్య సంకీర్తనలు - జానపద కళారూపాలు

ప్రముఖ వాగ్గేయకారుడైన తాళ్ళపాక అన్నమాచార్యుడు పదకవితా పితామహుడని, సంకీర్తనాచార్యుడని ప్రసిద్ధి కెక్కినట్లు మనకు తెలుసు. ఆ మహనీయుడు శ్రీ వేంకటేశ్వరునిపై జీవితాంతం అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు 32 వేలు రచించి ఆడిపాడి తరించాడు. ఆయన క్రీ.శ. 1408లో పుట్టి 1503లో దివ్యధామం చేరినట్లు తెలుస్తున్నది.

పద్యం రాజ్యమేలుతున్న సమయంలో సంకీర్తనకు ప్రాధాన్యమిచ్చి సామాన్య ప్రజానీకానికి భక్తితత్త్వాన్ని ప్రబోధించిన ప్రజాకవి అన్నమాచార్యుడు. సమకాలింగానే కాక అంతకుపూర్వమే జానపదుల నోళ్ళల్లో నాని ప్రచారం పొందిన ఎన్నో జానపదగేయరీతుల్ని స్వీకరించి ఆబాణీల నన్నింటిని తన సంకీర్తన సాహిత్యంలో పొందుపరిచిన ఘనత ఆ మహనీయునిదే. అలాగే జానపద కళారూపాల్ని సైతం తన సంకీర్తనల్లో పొందుపరచిన ఘనత అన్నమాచార్యునిదే.

నన్నయ నుంచి తెలుగు సాహిత్యం ప్రారంభమైనా అది మార్గ పద్ధతిలోనే నడిచింది. అంతకుముందు ఎప్పటినుంచో తెలుగులో జానపద సాహిత్యమూ కొనసాగుతూనే వచ్చింది. కాని దాన్ని ఆదరించినవాళ్ళు లేక పోవటం వల్ల మనకు అది లభించలేదు. ఇటీవలి కాలంలో పోయినదిపోగా లభించినంత మాత్రమైనా జానపద విజ్ఞానాన్ని సేకరించి, విశ్లేషించి, పరిశోధించి ఫలితాల్ని ప్రకటించటం ముదావహం. ఈ జానపద విజ్ఞానాన్ని నాలుగురకాలుగా విభజించారు. మౌఖిక జానపద విజ్ఞానం, సాంఘిక జానపద ఆచారాలు, వస్తు సంస్కృతి, జానపదకళలు అనేవి ఈ నాలుగు. నాల్గవ విభాగమైన జానపద కళల్లో జానపద సంగీతం, జానపద నృత్యం, జానపద రూపకం చేరుతాయి. ఇవి మన పూర్వులకుకూడా తెలుసు. కాకపోతే మనవాళ్ళు వాటిని 'దేశి' సంబంధిగా భావించారు. కారణమేమంటే సాహిత్యాన్ని మార్గ, దేశి అని విభజించుకొని ఈ సాహిత్యాన్ని దేశి సంబంధిగా తలంచారు. వాస్తవానికి ఈ మార్గ, దేశి విభజన మొదట సంగీతపరంగాను, ఆ తర్వాత నృత్యపరంగాను, ఆవెనుక సాహిత్యపరంగాను విభజించినట్లు తెలుస్తున్నది.

సంస్కృతంగానీ, తత్సమానంగానీ మార్గగాను, తదితరమైంది అంటే ప్రజల వాడుకలోని భాషాసాహిత్యాలు 'దేశి' అని సాహిత్యపరంగా చెప్పుకొన్నట్లు గానే సంగీతము, నృత్యాలలో కూడా శాస్త్రీయమైన విధానమంతా మార్గ అని ఆయా ప్రదేశాలలో జానపదులు వాడుకొనే సంగీతం గానీ, నృత్యం గానీ 'దేశి' అని లాక్షణికులు నిర్ణయించారు.

ముందే మనవి చేసినట్లు ఈ దేశి సంబంధమైన ఆటపాటలు సామాన్య ప్రజల్లో విరివిగా వాడుకలో ఉండేవి. పండగ పబ్బాల్లో, ఉత్సవాలు, ఊరేగింపులలో తిరునాళ్ళు, తీర్థాలలో వీటి ప్రాముఖ్యం బాగా కనిపిస్తూ ఉంటుంది. ఈ దేశి సంబంధమైన జానపద క్రీడలు, సంగీతము ఆటపాటల రూపంలో ప్రాముఖ్యం వహించాయి. ప్రాచీన మానవుడు సుఖసంతోషాల సమయంలో ఆడిపాడుకొన్న ఈ ఆటపాటలే జానపద కళారూపాలు. ఇవి అతి ప్రాచీనకాలం నుంచి ఉన్నట్లు పాల్కురికి సోమనాథుడే పేర్కొని ఉండటం గమనించదగిన అంశం.

"........పర్వతపదము లానంద
పదములు శంకర పదములు నివాళి
పదములు వాలేశ పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు"

—మొదలైన అనేక జానపద గేయరీతుల్ని పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నాడు. ఇలాగే ఆనాటి జానపద ప్రదర్శన కళారూపాల్ని అనేకం పేర్కొన్న ఘనత పాల్కురికి సోమనాథునిదే.

"భారతాదికథల చీరమరుగుల
నారంగ బొమ్మల నాడించువారు
కడు నద్భుతముగ కంబ సూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు"

"అమరాంగనలు దివినాడెడుమాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు
అవియద్గతి పక్షులాడెడునట్టి
భావన ప్రోకుల పై నాడువారు"

"వెండియు భవు బహువిధ చరిత్రముల
ఖండిత గతి నాటకంబు లాడుచును"

"ప్రమథ పురాతన పటుచరిత్రములు
క్రమమొంద బహునాటకము లాడువారు"

"అటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు"

"లలితాంగ రసకళాలంకారరేఖ
లలవడ బహురూప మాడెడువారు"

—ఈ విధంగా బొమ్మలాటలు, బహురూపాలు అంటే ఈనాటి పగటివేషాల లాంటి ఆటలు, వీధినాటకాలు మొదలైన అనేక జానపద ప్రదర్శన కళా రూపాల్ని ప్రస్తావించాడు.

ఈ పాల్కురికి సోమనాథుడు అన్నమాచార్యునికి మూడువందల సంవత్సరాల పూర్వుడు. అంటే ఈ జానపద కళారూపాలు అతి ప్రాచీనమైనవని తెలుస్తుంది.

అన్నమాచార్యుడుకూడా అనేక జానపద కళారూపాల్ని తన సంకీర్తనల్లో ప్రస్తావించడమే గాదు వాటి వివరణ గూడా చూపించటం విశేషం. బొమ్మలాటలు, కోలాటం, గొబ్బిళ్ళు, తుమ్మెద, చందమామ, అల్లోనేరేళ్లు, జాజర, చాంగుభళా, తందనాన, కూగూగు, దోబూచి, ఎఱుక చెప్పటం, బహురూపం, యక్షగానం, వీధినాటకం, పగటివేషాలు మొదలైన జానపద కళారూపాల్ని తన సంకీర్తనల్లో నిక్షిప్తం చేశాడు. అంటే అన్నమాచార్యుని కాలానికి, అంతకంటే ముందూ జానపదులలో ప్రచారంలో ఉండే ఎన్నో జానపద కళారూపాలకి ప్రాణం పోసి జీవింపజేసిన ఘనత అన్నమాచార్యునిదే. వీటిని అన్నమాచార్యుని సంకీర్తనల్లో సోదాహరణంగా పరిశీలిస్తే వాటి ప్రాముఖ్యమెంతటిదో తెలుస్తుంది.

అన్నమాచార్యుని సంకీర్తనల్లో శృంగార సంకీర్తనల సంఖ్య ఎక్కువే అయినప్పటికీ అధ్యాత్మ సంకీర్తనలు తాత్త్విక దృక్పథంతో చెప్పిన తీరు మానవులకందరికీ ప్రబోధంగా ఉంది. ప్రపంచమే, అందులో సంసారమే అందులో జీవితమే నాటకమని, జగన్నాటక సూత్రధారి అయిన ఆ శ్రీ వేంకటేశుడే ఈ ప్రపంచంలోని మానవులనే బొమ్మల్ని ఆడించేవాడని సముచిత

మైన రీతిలో అన్నమాచార్యుడు వర్ణించి ఉండటం బొమ్మలాట ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది. ఈ బొమ్మలాటలు రకరకాలు. తోలుబొమ్మలాట, కర్రబొమ్మ లాట, బుట్టబొమ్మలాట మొదలైన అనేకమైన బొమ్మలాటలు మనం ఈనాడూ చూస్తున్నాం. ఈ జానపద కళారూపాన్ని చక్కగా చిత్రించాడు అన్నమా చార్యుడు.

"ఆటవారిగూడి తౌర
ఆటవారిగూడి అన్నిచోట్ల బొమ్మ
లాటలాడించ నధికుండవై తివి ॥పల్లవి॥

గురుతరమగు పెద్ద కొట్టాములోపల
తిరమైన పెనుమాయ తెరగట్టి
అరయ నజ్ఞానములని యడ్డముగ జేసి
పరగ సుజ్ఞాన దీపములు ముట్టించి ॥ఆట॥

తోలుబొమ్మల దొరకని గడియించి
గాలిచేత వాని కదిలించి
తూలేటి రసములు తొమ్మిది గడియించి
నాలుగు ముఖముల నలువున నాడించ ॥ఆట॥

నిన్నే మెత్తురుగాని నీకేమి నీలేరు
మన్నించు దాతలు మరిలేరు
ఎన్నగ తిరువేంకటేశ్వర నీదాసు
లున్నతులై నిన్ను నుబ్బించి పొగడగ ॥ఆట॥

—ఇందులో ఈ ప్రపంచాన్ని పెద్ద కొట్టంగా భావించాడు. పెనుమాయ అనే తెరను కట్టాడు. అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టడానికి ఈ బొమ్మలాటద్వారా సుజ్ఞానదీపాల్ని వెలిగించాడట. అంటే ప్రజల్ని ప్రబోధిస్తున్నాడని గ్రహించ వచ్చు. ప్రపంచంలోని ప్రజలందరిని తోలుబొమ్మలుగా జేసి పలువిధాలుగా ఆడిస్తున్నాడట భగవంతుడు. "నిన్నే మెత్తురుగాని నీకేమి నీలేరు, అనే పాదంలో 'నీయంతటి మహనీయుణ్ణి మెచ్చుకొంటారుగాని ఏమివ్వగలరు' అని భగవంతుని పరంగా చెప్పినా, పాపం బొమ్మలాటవారి దీనస్థితిని, ఈనాటికి నిజమా అన్నట్లు ఆటను మెచ్చుకొన్నవాళ్లు ఉన్నా వాళ్ళదారిద్ర్యాన్ని పోగొట్టే దాతలు లేరే అని ఆనాడే అన్నమాచార్యుడు చింతించినట్లు తెలుస్తున్నది. ఇది

"వెండియు భవు బహువిధ చరిత్రముల
ఖండిత గతి నాటకంబు లాడుచును"

"ప్రమథ పురాతన పటుచరిత్రములు
క్రమమెంద బహునాటకము లాడువారు"

"అటుగాక సాంగభాషాంగక్రియాంగ
పటునాటకంబుల నటియించువారు"

"లలితాంగ రసకళాలంకారరేఖ
లలవడ బహురూప మాడెడువారు"

—ఈ విధంగా బొమ్మలాటలు, బహురూపాలు అంటే ఈనాటి పగటివేషాల లాంటి ఆటలు, వీధినాటకాలు మొదలైన అనేక జానపద ప్రదర్శన కళా రూపాల్ని ప్రస్తావించాడు.

ఈ పాల్కురికి సోమనాథుడు అన్నమాచార్యునికి మూడువందల సంవత్సరాల పూర్వుడు. అంటే ఈ జానపద కళారూపాలు అతి ప్రాచీనమైనవని తెలుస్తుంది.

అన్నమాచార్యుడుకూడా అనేక జానపద కళారూపాల్ని తన సంకీర్తనల్లో ప్రస్తావించడమే గాదు వాటి వివరణ గూడా చూపించటం విశేషం. బొమ్మలాటలు, కోలాటం, గొబ్బిళ్ళు, తుమ్మెద, చందమామ, అల్లోనేరేళ్లు, జాజర, చాంగుభళా, తందనాన, కూగూగు, దోబూచి, ఎఱుక చెప్పటం, బహురూపం, యక్షగానం, వీధినాటకం, పగటివేషాలు మొదలైన జానపద కళారూపాల్ని తన సంకీర్తనల్లో నిక్షిప్తం చేశాడు. అంటే అన్నమాచార్యుని కాలానికీ, అంతకంటే ముందూ జానపదులలో ప్రచారంలో ఉండే ఎన్నో జానపద కళారూపాలకి ప్రాణం పోసి జీవింపజేసిన ఘనత అన్నమాచార్యునిదే. వీటిని అన్నమాచార్యుని సంకీర్తనల్లో సోదాహరణంగా పరిశీలిస్తే వాటి ప్రాముఖ్యమెంతటిదో తెలుస్తుంది.

అన్నమాచార్యుని సంకీర్తనల్లో శృంగార సంకీర్తనల సంఖ్య ఎక్కువే అయినప్పటికీ అధ్యాత్మ సంకీర్తనలు తాత్త్విక దృక్పథంతో చెప్పిన తీరు మానవులకందరికీ ప్రబోధంగా ఉంది. ప్రపంచమే, అందులో సంసారమే అందులో జీవితమే నాటకమని, జగన్నాటక సూత్రధారి అయిన ఆ శ్రీ వేంకటేశుడే ఈ ప్రపంచంలోని మానవులనే బొమ్మల్ని ఆడించేవాడని సముచిత

మైన రీతిలో అన్నమాచార్యుడు వర్ణించి ఉండటం బొమ్మలాట ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది. ఈ బొమ్మలాటలు రకరకాలు. తోలుబొమ్మలాట, కర్రబొమ్మలాట, బుట్టబొమ్మలాట మొదలైన అనేకమైన బొమ్మలాటలు మనం ఈనాడూ చూస్తున్నాం. ఈ జానపద కళారూపాన్ని చక్కగా చిత్రించాడు అన్నమాచార్యుడు.

"ఆటవారిగూడి తౌర
ఆటవారిగూడి అన్నిచోట్ల బొమ్మ
లాటలాడించ నధికుండవై తివి ॥పల్లవి॥

గురుతరమగు పెద్ద కొట్టాములోపల
తిరమైన పెనుమాయ తెరగట్టి
అరయ నజ్ఞానములని యడ్డముగ జేసి
పరగ సుజ్ఞాన దీపములు ముట్టించి ॥ఆట॥

తోలుబొమ్మల దొరకని గడియించి
గాలిచేత వాని కదిలించి
తూలేటి రసములు తొమ్మిది గడియించి
నాలుగు ముఖముల నలువున నాడించ ॥ఆట॥

నిన్నే మెత్తురుగాని నీకేమి నీలేరు
మన్నించు దాతలు మరిలేరు
ఎన్నగ తిరువేంకటేశ్వర నీదాసు
లున్నతులై నిన్ను నుబ్బించి పొగడగ ॥ఆట॥

—ఇందులో ఈ ప్రపంచాన్ని పెద్ద కొట్టంగా భావించాడు. పెనుమాయ అనే తెరను కట్టాడు. అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టడానికి ఈ బొమ్మలాటద్వారా సుజ్ఞానదీపాల్ని వెలిగించాడట. అంటే ప్రజల్ని ప్రబోధిస్తున్నాడని గ్రహించవచ్చు. ప్రపంచంలోని ప్రజలందరిని తోలుబొమ్మలుగా జేసి పలువిధాలుగా ఆడిస్తున్నాడట భగవంతుడు. "నిన్నే మెత్తురుగాని నీకేమి నీలేరు, అనే పాదంలో 'నీయంతటి మహనీయుణ్ణి మెచ్చుకొంటారుగాని ఏమివ్వగలరు' అని భగవంతుని పరంగా చెప్పినా, పాపం బొమ్మలాటవారి దీనస్థితిని, ఈనాటికి నిజమా అన్నట్లు ఆటను మెచ్చుకొన్నవాళ్లు ఉన్నా వాళ్ళదారిద్ర్యాన్ని పోగొట్టే దాతలు లేరే అని ఆనాడే అన్నమాచార్యుడు చింతించినట్లు తెలుస్తున్నది. ఇది

ఈనాడు నిజమైంది. మరి కవులు క్రాంతదర్శనులు కదా ! ఇలాగే ఇంకా అనేక సంకీర్తనల్లో బొమ్మలాటల ప్రస్తావన చూడగలం.

కోలాటం ఈనాటికీ తెలుగుగడ్డమీద బ్రతికిబట్టగట్టిన జానపద కళా రూపం. ఈ కోలాటం అనేక రకాలైన కోపులతో కూడి ఉంటుంది. ప్రాచీన కాలంలో స్త్రీలే ఈ కోలాటం ఎక్కువగా ఆడినట్లు తెలుస్తున్నది. కానీ ఈనాడు పురుషులు ఎక్కువగా కోలాటం వేస్తూ ఉండటం చూస్తూ ఉన్నాం. ఈ కోలాటంలో తాళం ప్రాధాన్యం వహిస్తుంది. తాళప్రధానంగానే కోలాటపు పాటల వరుసలు సాగుతూ ఉంటాయి. వనితల కోలాటాన్ని రూపచిత్ర సాక్షాత్కారంతో అన్నమయ్య వర్ణించిన తీరు అద్భుతంగా ఉన్నది.

"వేడుక వసంతము వేళనిదే
వాడవాడల వెంట వనితలాడేరు ॥వేడు॥

కేలుఁ గేలు జుట్టుపట్టి కెందామర మోములెత్తి
కోలఁ గోలఁ దాఁకఁజేసి గుంపువాయక
చాలుకొని యిద్దరేసి జంటలై సతులుగూడి
వోలి వేరొకతె కోలనొడ్డుతా నాడేరు ॥వేడు॥

పాలిండ్లు గదలగ బరువైన తురుములు
చీలుచు సోలుచుఁ గొంత వెనుకకును
మేలిమి పిఱుఁదులతో మెరయుచు మురియుచు
కోలలఁ బెడమరలి కోలాట మాడేరు ॥వేడు॥

—ఇందులో అన్నమాచార్యుడు కోలాటం వేసే తీరుని తానే అందులో ఒకడై వేసినట్లుగా వివరణాత్మకమైన చిత్రణ చేయటం గమనించదగ్గ అంశం. ఇద్దరిద్దరుగా కోలలతో ఆడే తీరుని చాలా సముచితంగా వర్ణించి తన వర్ణనా వైదగ్ధ్యాన్ని సైతం ప్రకటించుకొన్న మహా పదకవి అన్నమాచార్యుడు. ఇందులో మనం కోలాటం వర్ణన చూడగలుగుతున్నాము. ఆ కోలాటానికి సంబంధించిన రీతిని మరో సంకీర్తనలో చూడగలం. ఉదాహరణకు-

గోవింద నందనందన గోపాలకృష్ణ నీ
భావము మాకుం జిక్కె గోపాలకృష్ణ ॥గోవి॥

కొంగువట్టిన దేమోయి గోపాలకృష్ణ మా
పంగెన కోపుదువా గోపాలకృష్ణ
దొంగతనాల నవ్వేవు గోపాలకృష్ణ
బంగారు కాసెతోడ గోపాలకృష్ణ ॥గోపి॥

కొమ్మల చీరలంటిన గోపాలకృష్ణ
పమ్మి నిన్నుం దిట్టేము గోపాలకృష్ణ
కుమ్మరించేవేల సిగ్గు గోపాలకృష్ణ
బమ్మెర పోతిందుల గోపాలకృష్ణ ॥గోపి॥

—ఇందులో చీరలు దొంగిలించిన గోపాలకృష్ణుని గోపకలు ఆటపట్టించటం గమనించగలం. ఈ పదం తాళప్రధానంగా కొనసాగింది. ఆ కోలలదెబ్బలు తాళంగా వినిపిస్తున్నాయి. ఇదొక చక్కటి జానపద కళారూపం.

తెలుగునాట ఈనాడూ ప్రసిద్ధంగా చూచే జానపదకళారూపం గొబ్బిళ్లు. ఈ గొబ్బిపాటలు సంక్రాంతి సందర్భంలో స్త్రీలు వయోభేదం లేకుండా ఆడుతూ పాడుతూ ఉంటారు. ఆ దృశ్యం చూచి ఆనందించదగింది. ఇది ఆంధ్రదేశమంతటా పాటించే ఆట. తెలంగాణాలో బొడ్డెమ్మ, బతుకమ్మ పండుగల సందర్భాల్లో ఆడిపాడుకొనే పాటలు ఇలాంటివే. పేడతో గొబ్బిని చేసి ముంగిళ్ళలో ముగ్గులుపెట్టి పూలతోఅలంకరించి గొబ్బిచుట్టూ తిరుగుతూ ఆడుతూ ఈ గొబ్బిపాటలు పాడుతూ ఉంటారు. శ్రీకృష్ణలీలల్ని వర్ణించే ఈ ప్రసిద్ధపదం ఓ చక్కటి ఉదాహరణ.

"కొలని దోపరికి గొబ్బిళ్లో యదు
కులస్వామికిని గొబ్బిళ్లో ॥పల్లవి॥

కొండగొడుగుగా గోవుల గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపు దైత్యులకెల్లను, తల
గుండుగండనికి గొబ్బిళ్లో ॥కొల॥

పాపవిధుల శిశుపాలుని తిట్ల
కోపగానికిని గొబ్బిళ్లో
ఏపున గంసుని ఇడుముల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో ॥కొల॥

దండి వైరులను తరిమిన దనుజుల
గుండె దిగులునకు గొబ్బిళ్ళో
వెండిఁ బైడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్ళో ॥కొల॥

—ఈ సంకీర్తన అందరికీ అర్థమయ్యే రీతిలో సరళరీతిలో సాగింది. ఈ గొబ్బిళ్ళు పర్వదినాల్లోనే కాక వెన్నెలలో ఆడపిల్లలు ఆడుకోవటం కూడా ప్రసిద్ధమే.

ఇలాగే వెన్నెలలో ఆడుకొనే పాటలు చందమామ పదాలు. మళ్ళీ ఇవికూడా ఆడపిల్లలకే పరిమితం. తెలుగు తల్లులందరూ పాడే అన్నమయ్య ప్రసిద్ధపదం.

"చందమామ రావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నబాలు తేవా"

—అనే పాటలాంటి చందమామ పదాలు ఆడపిల్లలు వెన్నెల్లో ఆడుకొంటూ పాడుతూ ఆనందిస్తూ ఉంటారు. ఇలాగే వెన్నెల రాత్రుల్లో పిల్లలందరూకలిసి ఆనందోత్సాహాలతో పాడుతూ ఆడే పాటల అల్లోనేరేళ్ళు. ప్రధానంగా శారద రాత్రుల్లో పండగ పబ్బాల సమయంలోనూ పిల్లలు ఆడుతూ ఉంటారు. అల్లోనేరేళ్ళనే పదం పునరుక్తమవుతూ ఉంటుంది. అన్నమయ్య ప్రసిద్ధమైన 'అల్లోనేరేళ్ల' పదం మనకందరికీ తెలిసిందే.

నెయ్యము లల్లో నేరేళ్ళో
ఒయ్యన ఊరెడి ఉవ్విళ్ళో ॥పల్లవి॥

పలచని చెమటల బాహుమూలముల
చలముల లోనా జెలువములే
ధళధళమను ముత్తెపు జెరగు సురటి
దులిపేటి నీళ్ళ తుంపిళ్లో ॥నెయ్య॥

తొటతొట గన్నుల దొరిగేటి నీళ్ళు
చిటి పొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీవన్నెల మోవికి
గుటకలలోనా గుక్కిళ్లో ॥నెయ్య॥

గరగరికల వేంకటపతిఁ గౌఁగిట
పరిమళములతో బచ్చెనలు
మరుని వింటి కమ్మని యంప విరుల
గురితాకు లిసుప గుగ్గిళ్లో ॥నెయ్య॥

—ఇందులో చక్కటి తెలుగుదన ముట్టిపడేట్టుగా 'అల్లోనేరేళ్ళు' మనకందించిన అన్నమయ్య జానపద కళారీతి స్పష్టమవుతుంది.

ఇదే రీతిగా వసంతోత్సవ సమయాల్లో వెన్నెల రాత్రులలో స్త్రీలు, శృంగారప్రియులు ఆడుతూ పాడేపాటలు జాజర పాటలు. వీటిలో శృంగారంతో పాటు హాస్య చమత్కారాలు ఉంటూ ప్రేక్షకులకు అమితమైన ఆనందాన్ని అందిస్తాయి. అన్నమయ్య ప్రసిద్ధమైన జాజరపాటలో ఒకనాయిక శ్రీ వేంకటేశ్వరుని మీది వలపుతో పాడినపాట.

చాలుచాలు నీజాజర నన్ను
జాలి బరచె నీ జాజర ॥పల్లవి॥

వలపు వేదనల వాడేను ఈ
తలనొప్పులచేఁ దలఁకేను
పులకల మేనితోఁ బొరలేను కడు
జాలిగొని చల్లకు జాజర ॥చాలు॥

ఒల్లని నినుగని ఉడికేను నీ
చిల్లర చేతలఁ జిమిడేను
కల్లగందవొడిఁగాఁగేను పైఁ
జల్లకు చల్లకు జాజర ॥చాలు॥

తివిరి వేంకటాధిప నేను నీ
కవుగిటి కబ్బితిఁ గడునేను
రవరవ చెమట గరిగి నేడు- ఇదే
చవులాయెను నీ జాజర ॥చాలు॥

—ఈ విధంగా వెన్నెలలో ఆడుకొనే ఈ జానపద కళారూపాలు మనోహరమై ఒప్పుతూ ఉంటాయి.

జానపద కళారూపాల ప్రాథమిక దశను వివరించే తందానాన, చాంగుభళా మొదలైన పాటలు అన్నమయ్యలో ప్రసిద్ధమైనట్లు చూడగలం. ఈనాడు

బుర్రకథలో తందనాన, చాంగుభళా అనే పదాలు ఆయా దరువుల్లో, పాటల్లో పునరుక్తాలవటం ప్రసిద్ధమే. ఇవి ప్రాచీనకాలం నుంచి ఉన్నట్లు మనకు తెలుస్తున్నది. ఇంతకుముందే మనం గుర్తించినట్లుగా చాంగుభళాను కూడా పాల్కురికి సోమనాథుడు పేర్కొని ఉండటం గమనించదగ్గ అంశం.

"అలరుచు బడి హొరులట్ల ఎందరును
లలిమెచ్చి చాంగుభళా యనువారు" అని పేర్కొన్నాడు.

మరి అన్నమాచార్యుల చాంగుభళా ప్రదం ప్రసిద్ధమే కదా! చాంగుభళా అనేది కోలాటపు వరుసల్లో ఒకటిగా కొందరు భావించారు. కానీ ఎచ్చరిక, పరాకు వంటిదని కూడా చెప్పారు. ఇది బాగు, బాగు, భేష, భేష అని మెచ్చుకోవటం లాంటిదని భావించవచ్చు. అలమేల్మంగా వైభవాన్ని చిత్రించే అన్నమాచార్యుని చాంగుభళా పదమిది.

"చక్కని తల్లికి చాంగుభళా తన
చక్కెర మోవికి చాంగుభళా ॥పల్లవి॥
కులికేటి మురిపెపు గుమరింపు దన
సళుకు జూపులకు చాంగుభళా
పలుకుల సొలపుల బతితో గసరెడి
చలముల యలుకకు చాంగుభళా ॥చక్క॥

–ఇలాగే తందనాన పాట చాలా ప్రసిద్ధమైంది. ఏకతారలాంటి వాద్యం వాయిస్తూ పాడేపాట. వాస్తవానికి కథాగేయ ప్రవర్తనలాంటి పదం ఈ తందనాన పాట అంటే బహుశః ఈనాడు బుర్రకథ ప్రవర్తకులకు మూలమై ఉండవచ్చు. కారణమేమంటే ఈ జంగం కథలు మొదలైనవి బుర్రకథకు మూలాలు. అందువల్లనే ఇది ఒకరు ఆడిపాడి వినిపిస్తూ ఉంటే ప్రేక్షకులు ఆనందించే తీరు ఇందులో గమనించగలం. అన్నమాచార్యుని తందనాన పదం ప్రసిద్ధమై ప్రచారంలో ఉండటం మనకు తెలుసు.

"తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి॥
బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే పర
బ్రహ్మమొకటే పరబ్రహ్మమొకటే ॥తంద॥

కందువగు హీనాధికము లిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతా నొకటే
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥తంద॥

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర నదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలు డుండేటి సరిభూమి యొకటే ॥తంద॥

—ఇది తత్త్వంలాగా సాగింది. తాత్త్వికాంశాలు సైతము చాలా సముచితంగా సామాజికస్పృహతో అన్నమాచార్యుడు వర్ణించాడు. వర్ణం, వర్గం మనుషులు కల్పించుకొన్నవేగాని భగవంతుని దృష్టిలో రాజు బంటు, బ్రాహ్మణుడు చండాలుడు సమానమనే తాత్త్వికభావజాలాన్ని అన్నమాచార్యు డానాడే చాటి చెప్పిన తీరు ఇందులో మనం గమనించగలం.

ఎఱుక చెప్పటం కూడా అన్నమాచార్యుడు తన సంకీర్తనల్లో వాడుకొని ఉండటం గుర్తించగలం. ఎఱుక చెప్పడమే సోది చెప్పటం. యక్షగానాల్లో ఎఱుకత ప్రవేశం ప్రసిద్ధమే. అన్నమయ్య యక్షగాన సరణిని కూడా తెలిసిన వాడు మాత్రమేకాదు రామాయణాన్ని యక్షగానంగా రచించి ఉండవచ్చునని విద్వాంసుల అభిప్రాయం. అందుకు కథాగేయాలు ప్రధానంగా రామాయణ కథ, నారసింహకథ, హనుమత్కథ, కృష్ణకథ అనేవి సుప్రసిద్ధంగా అన్నమా చార్యుని సంకీర్తనల్లో మనం గుర్తించగలం. ఇంతకుముందే బుర్రకథ విషయం ప్రస్తావించుకొన్నాం. కథాగేయాలు అనబడే ఇవే హరికథగా బుర్ర కథగా ఆధునికయుగంలో వేర్వేరుగా ప్రసిద్ధిపొంది ప్రచారంలో ఉన్నాయి. అంటే వీటికి మూలం యక్షగానమని. కానీ ఈ యక్షగానానికి కూడా మూల మైంది వీధినాటకం. ఈ కథాగేయ ప్రవచనం వేర్వేరు రూపాల్నిధరించిందని, బహురూపి అయిందని మనం తెలుసుకోగలం. అంటే జానపద కళారూపాల ప్రాభవాన్ని అన్నమాచార్యుడు వేనోళ్ళ ప్రకటించాడు తన సంకీర్తనల్లో

పదాభినయం క్షేత్రయ్యతోనే ప్రారంభమైందని, అది సిద్ధేంద్రయోగి భామాకలాపంలో ప్రసిద్ధమేననీ, అలాగే నారాయణతీర్థుల తరంగాలు కూడా అభినయించేవారని మనకు తెలుసు. అయినా పదకవితా పితామహుడని ప్రసిద్ధి

కెక్కిన అన్నమాచార్యుడు ఆడిపాడి అభినయించి తన భక్తిని ప్రకటించు కొన్నవాడని మనకు తెలుసు. కనుకనే అన్నమాచార్యుని సంకీర్తనల్లోనే ఈ అభినయం సంగతి, బహురూపాలసంగతి గమనించగలం. తెరమరుగు ఆటల్ని, బహురూపాల్ని పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నాడు. అలాగే అన్నమయ్య పదాల్లోను మనం చూడగలం.

"పన్నిన తెరమరుగు బహురూపము లెల్లాను

కన్నదాకానే కానీ కడ(జొకే"అనేపదంలో ఈవిషయాన్ని వివరించాడు.

అంతేగాకుండా- "అలరులు గురియగ నాడెనదే

అలకల గులుకుల నలమేలుమంగ" అనే అన్నమాచార్యుని ప్రసిద్ధపదంలో అలమేల్మంగా దేవి శ్రీ వేంకటేశ్వరుని మైమరపించేలాగా దివ్య నృత్యాన్ని అభినయించి శృంగార లీలావిలాసాలను అభివర్ణించి తరించాడు అన్నమాచార్యుడు. అరతెరమరుగున ఆడినతీరు 'భామా కలాపం' లోని సత్యభామ అభినయాన్ని ప్రస్ఫుటం చేస్తున్నది.

మరో సంకీర్తనలో నాయిక తెరమరుగున ఆడుతూ దేశి శుద్ధాంగాలను అభినయించి చూపిన తీరును చిందు, జక్కిణి మొదలైన ఆటలను బహు తాళ మానములతో అభినయించిన తీరును అన్నమయ్య అభివర్ణించి దేశీనృత్యాన్ని పలురీతుల ప్రకటించి ఉండటం మనం గమనించగలం.

ఈ విధంగా అన్నమాచార్యుడు తన సంకీర్తనలలో వివిధ రకాలైన జానపద కళారూపాలను ప్రదర్శించి ఉండటం విశేషం. అవి ఆయన కాలానికి అంతకంటే ముందు ప్రసిద్ధమై ప్రచారం పొంది జనపదాలలో జానపదుల మనోభావాల కనుగుణంగా ఆనందోత్సాహాలను వినోదంతో పాటు విజ్ఞానాన్ని ప్రసాదించేవని మనకు స్పష్టమవుతుంది. అందుకే అన్నమాచార్యుడు మహా వాగ్గేయకారసత్తముడే అయినప్పటికీ ప్రజలకానందాన్ని కలిగించే జానపద కళలను పోషించిన ప్రజాకవి.

# 9. ఇతర వాగ్గేయకారులపై అన్నమయ్య ప్రభావం

"కొలని దోపరికి గొబ్బిళ్లో యదు-
కులస్వామికిని గొబ్బిళ్లో ॥పల్లవి॥

—అనే గొబ్బిళ్ళపదమూ-

"చందమామ రావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నబాలు తేవో" —అనే చందమామపదమూ

"తొల్లింటివలెగావు తుమ్మెదా- ఇంక
వొల్లవుగా మమ్ము- నో తుమ్మెదా ॥పల్లవి॥

తోరంపు రచనల తుమ్మెదా కడు
దూరేవు గొందులే తుమ్మెదా
దూరినా నెరుగవు తుమ్మెదా మమ్ము
ఓరగా చూడకు ఓ తుమ్మెదా ॥తొల్లింటి॥

—అనే తుమ్మెద పదమూ-

"తందనాన ఆహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి॥"

—అనే తత్వప్రబోధాత్మకమైన తత్వంలాంటి తందనాన పాటా-

"మేడలెక్కి నిన్నుజూచి కూడేననే యాసతోడ
వాడుదేరి పుస్పరందుర వేంకటేశ
యాడనుంటి విందాకాసురా" (శృం. సం. 13-223) అనే ఏలపాటా

"చాలుచాలు నీ జాజర నన్ను
జాలిబరచె నీ జాజర" (శృం. సం. 12-332)

—అనే జాజరపాటా-

"జోవచ్యుతానంద జోజో ముకుంద
రావె పరమానంద రామగోవింద" ॥పల్లవి॥

**అనే జోలపాట మనకందించి, తెలుగుజాతికెంతో సేవచేసిన మహావాగ్గేయకార సత్తముడు తాళ్ళపాక అన్నమయ్య. తనకు పూర్వమూ, సమకాలికమూ**

అయిన ఎన్నో జానపద గేయరీతుల్ని గ్రహించి వాటిని నిబద్ధీకరించి పద్య సాహిత్యంతో సమానమైన గౌరవ ప్రపత్తుల్ని కలిగించి పదసాహిత్యానికి ప్రాముఖ్యం తెచ్చిన పదకవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు- అని ప్రసిద్ధిపొందిన మహావాగ్గేయకారుడు అన్నమయ్య ఆధ్యాత్మ, శృంగార పదాల పేర 32 వేల పదాలు రచించి, భక్తి, ఆధ్యాత్మిక ప్రబోధంతో, అలమేలు మంగా శ్రీ వేంకటేశ్వరుల అలౌకిక శృంగారం, మధుర భక్తిప్రపత్తులతో తెలుగుజాతికి ఎన్నటికీ మరువలేనంత సేవచేసిన మహనీయుడు అన్నమయ్య. తదనంతర కాలంలో తెలుగులో వెలసిన వాగ్గేకారులందరికీ మార్గదర్శకుడు; ఆదర్శ వాగ్గేయకారుడు; అంటే అన్నమయ్య ప్రభావం అన్నివిధాలా తరువాతి ఇతర వాగ్గేయకారులపై ఎంతగానో ప్రసరించింది.

తెలుగులో అనాదిగా వస్తూన్న- పూర్వోక్తమైనట్టి- సహజమూ, స్వాభావికమూ అయిన నిసర్గ మనోజ్ఞమైన జానపద కవితను మనపూర్వులు సేకరించి పరిరక్షించి పోలేదు. ఇది కేవలం వాగ్రూపం (oral)లో ఉండిపోయింది. ఇది ఆడిపాడుకోడానికి ఉపకరించేదిగా ప్రజల నోళ్ళలో ఉండిపోయింది. అనంతర కాలంలో వెలసిన పద్యకవిత రాజాదరణకి పాత్రమైంది. తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పండితేతర సాహిత్యమూనని రెండు విధాలని చెప్పవచ్చు. దీన్నే ప్రౌఢ లేదా శిష్టేతర సాహిత్యమనీ పేర్కొవచ్చు. కానీ పూర్వోక్తమైనట్లు జానపద సాహిత్యమే అనాది; అన్ని సాహిత్యాలకీ అదే పునాది. అలాంటి జానపద బాణీలను స్వీకరించి పదకవితలను ప్రచారంలోకి తెచ్చిన ఘనత తాళ్ళపాక అన్నమయ్యకు దక్కుతుంది.

అన్నమయ్యకు పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ బిరుదులున్నాయి. ఇతడు 1408లో జన్మించి 1503లో దివ్యధామం చేరాడు. కడప మండలంలోని తాళ్ళపాక ఇతని స్వగ్రామం. ఆ వెనుక తిరుమలలో స్థిరనివాస మేర్పరచుకొని శ్రీ వేంకటేశ్వరునిపై భక్తితో 32 వేల సంకీర్తనలు రచించి, ఆడిపాడి ముక్తిపొందిన మహనీయుడు. ఇవి అధ్యాత్మ సంకీర్తనలనీ రెండువిధాలు. ఇవివేంకటేశ్వరస్వామికంకితాలు. శృంగారసంకీర్తనలనిపదాలు, సంకీర్తనలు సమానార్థకాలు. అన్నమయ్య సమకాలిక వాగ్గేయకారులు ఆయన పుత్రుడు పెదతిరుమలాచార్యుడు;మనుమడు చినతిరుమలాచార్యుడు. తదనంతర వాగ్గేయకారులు-క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్య

కవి, త్యాగరాజు- అనేవారు ప్రముఖులు. ఇంకా ఎందరో వాగ్గేయకారులు వెలిశారు. అందరికీ అన్నమయ్య మార్గదర్శకుడైన వాగ్గేయకారుడు.

ఇతర ప్రధాన వాగ్గేయకారులపై అన్నమయ్య ప్రభావాన్ని తెలుసుకొనే ముందు వాగ్గేయకారుడంటే తెలుసుకోవడం అవసరం. పదం అనబడే సామాన్యార్థంలో పాట అనే వాడుక. ఈ పాట రాగతాళ సహితమూ కావచ్చు, లేదా కేవలం స్వరసహితమూ కావచ్చు. ఇది జానపద గేయాల్లో స్పష్టంగా తెలిసే అంశం. కోలాటం, దంపుళ్ళ పాటల్లో విధిగా తాళముంటుంది, రాగంతో పాటు. విసుర్రాయి, కపిల (మోట) పాటల్లో రాగమేగానీ, తాళాని కవకాశం లేదు. అయితే రెండింట లయ ఉండితీరుతుంది. పదం పాడ మన్నది జనవ్యవహారం. తాళ్ళపాక అన్నమయ్య సంస్కృతంలో 'సంకీర్తన లక్షణం' రచించాడు. అయితే ఈనాడది అలభ్యం. అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు దాన్ని తెలుగులో కనువదించినది లభిస్తూంది. అందులో పదనిర్వచనాదు లున్నాయి. అలాంటి పదకర్తలను వాగ్గేయకారులంటారు.

"వాఙ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభి ధీయతే
వాచం గేయం చ కురుతేయః సవాగ్గేయకారః॥"

—అని వాగ్గేయకారుల లక్ష్యం. పదంలో సాహిత్యమూ, సంగీతమూ రెండూ ఉంటాయి పదంలోని సాహిత్యాంశాన్ని 'వాక్'అనీ,ధాతువనీ, సంగీతాంశాన్ని మాతువనీ వ్యవహారముంది. వీటికి ధాతుమాతువులని సంగీత పరిభాషలోని సంజ్ఞలు. పదంలోని మాతు లేక వాక్కు- సాహిత్యాన్నీ, ధాతు లేక సంగీతాన్నీ- రెంటినీ రచన చేయగలవాడు వాగ్గేయకారుడు. కవికంటే గూడా ఇతడు ప్రతిభాపాండిత్య సంపన్నుడు.

ఇలాంటి గేయమర్మాలను గుర్తించి తన ప్రతిభాపాండిత్య ప్రకర్షలతో తెలుగుదన ముట్టిపడేట్టు- ఆనాడు రాయలసీమలో ప్రత్యేకించి కడప మండలంలో- వ్యవహారంలో ఉండిన పదజాలాన్ని ప్రయోగించి చక్కటి మనోహరమైన పదరచనచేసి పద్యకవులను మించిపోయిన- అటు పండితులను ఇటు ముఖ్యంగా పామరులను ఆకర్షించే రీతిలో 32 వేల సంకీర్తనలు- శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలు- రచించి తరించాడు అన్నమయ్య. ఇవి పాడుకోడానికి ఉపకరించేవి. కారణం సంగీత సాహిత్యాల సమ్మేళన మీపదాలు. విన్న వెంటనే శ్రవఃప్రేయమై, ఆలోచించినకొలదీ అమృతాయమానమైన ఫలా

లందిచ్చే సాహిత్యం రమణీయమూ, కమనీయమూ అయి రసానందజనకమై- గీతిరీతితో- ఒప్పారే తీరులో ఈ పదాల రచన సాగింది. దానికితోడు తదనంతరకాలంలో పదాభినయం ప్రాముఖ్యం వహించింది. అయినప్పటికి అన్నమయ్య రచనల్లో విశిష్టమైన "అలరులు గురియగ నాడెనదే" అనే ప్రసిద్ధ పదం వల్ల అభినయం సైతముండేదనీ, అది తరువాత కాలంలో తెరమరుగు ఆట అయిన యక్షగానం, కూచిపూడి అభినయం లాంటి పదాభినయముండే దని తెలుస్తుంది. అంటే అన్నమయ్య కేవలం సంకీర్తనలు వ్రాసి ఊరకే ఉండలేదు. వాటిని పాడి, ఆడి తరించాడు. ఈ పదాలు శ్రీ వేంకటేశ్వర స్వామి అలమేలు మంగాదేవి సంబంధమైన అలౌకికశృంగారపదాలు. ఇందులో శృంగారంతోపాటు, మధురభక్తి, భక్తి, ఆధ్యాత్మికత, తాత్త్వికత, నీతి, వైరాగ్యాదులు అనన్యసామాన్యంగా వర్ణించి సామాన్యప్రజానీకానికి ప్రబోధం చేశాడు అన్నమయ్య. ప్రప్రథమ వాగ్గేయకారుడైన అన్నమయ్యలో తేటతెలుగు మాటలతో సంగీతంకంటే సాహిత్యం ప్రాధాన్యం వహించిందని పెద్దలమాట. తదనంతరకాలం వెలసిన వాగ్గేయకారు లుపయోగించి పలురీతి పదరచనతో పాటు పైనిపేర్కొన్న వివిధ విషయాలకు అన్నమయ్య మార్గదర్శకుడనీ, అతని ప్రభావం తదితరులపై విస్పష్టంగా గోచరిస్తుంది. అది అన్నమయ్య ముద్ర. వీటిని క్రమంగా పరిశీలిద్దాము.

అన్నమయ్య తరువాత అనేక ప్రసిద్ధ పదకర్తలు వెలిసి తెలుగులోని ఈ పదసాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. సమకాలికంగా అన్నమయ్య పుత్రపౌత్రు లీమార్గాన్ననుసరించారు. అన్నమయ్య మార్గంలో పయనిస్తూ పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, పౌత్రుడు చిన తిరుమలాచార్యుడు శృంగార అధ్యాత్మ పదాలు రాగతాళాలతో శ్రీ వేంకటేశ్వరాంకితంగా రచించి వాగ్గేయ కారులుగా నిరూపించుకొని, విశిష్టాద్వైతమతాన్ని భక్తిపురస్సరంగా వ్యాపింప జేశారు. వీరి పదాల్లో భక్తి, మధురభక్తి, శృంగారం, నీతి వైరాగ్యాలు నిండారిన రీతి కనిపిస్తుంది. తాళ్ళపాకపదకవులు రాజాశ్రయ విముఖులు. భగవచ్చరణాలే శరణ్యమని నమ్మిన భక్తాగ్రేసరులు.

తండ్రి కేమాత్రం తీసిపోని రీతిల్లో చక్కటి పదరచన చేసిన మహా నీయుడు పెద తిరుమలాచార్యుడు. శృంగారరస నిర్భరంగా రచించిన ఈ మనోజ్ఞపదం తండ్రిని మించిన కొడుకులా కనిపింపజేస్తుంది.

"ఇద్దరి చుట్టరికేలు యెంచియెంచి పోలుచరే
సుద్దులనే మోహము సూటిపడుగాని ॥పల్లవి॥

సతివదనము పూర్ణచంద్రుని బోలుచరే
అతని కన్నుల కలువ లలరుగాని
మితిలేని తురుము తుమ్మెదల బోలుచరే
తతి పతిమోవి దేనె దైలువారుగాని ॥ఇద్దరి॥

(శృం. సం. 23-240)

ఇలాంటి పెద తిరుమలాచార్యుని పదరచనకు తండ్రి అన్నమయ్య ఆదర్శమనదగ్గ పదం గమనించండి.

"ఏమొకో చిగురుటధరమున యెడనెడ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥

కలికి చకోరాక్షికి కడకన్నులు కెంపై తోచిన
చెలువం బిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన యాకొనచూపులు
నిలువున బెరుకగ నంటిన నెత్తురు కాదుగదా ॥ఏమొకో॥

(శృం. సం. 12-82)

ఈ ఉదాహరణల్లో తండ్రికుమారుల చక్కటి భావుకత, కల్పన, చమత్కారమూ, భాషాప్రయోగ దక్షత విదితమవుతాయి.

వర్ణనా వైదగ్ధ్యంలోను తండ్రిని ఏమాత్రం తీసిపోని రీతిలో పదరచన చేసిన ఘనుడు పెద తిరుమలాచార్యుడు- ఇతడు షడృతు వర్ణన చేసిన తీరు :

"అంగన విభుఁ గూడేదది యేకాలమోకాక
అంగజుని కిది గాలమాయనోకాక ॥పల్లవి॥

చెలియ చెంపలనుండి సేవంతిరేకులే రాలె
అలరు వసంతకాలమో కాక
కలికికన్నులనుండి కన్నీటిబొట్లు రాలె
యెలమి వానకాల మిదియో కాక ॥అంగన॥

(శృం. సం. 23-525)

ఇందులో నాయికా విరహపరంగా ఋతువర్ణన చేయబడింది. దీనికి చక్కటి ఆధారం - అన్నమయ్య పదం పరిశీలనార్హం.

"కాలము లారును గలిగె నీకు
బాలకియందే పైపై నీకు ॥పల్లవి॥

సతికొప్పు విరులు జలజల రాలిన
లతల వసంతకాలము నీకు
కతగాఁ దన మైకాకలు చూపిన
అతివేసవి కాలమప్పుడే నీకు ॥కాలము॥

(శృం. సం. 26-88)

కాగా అన్నమయ్య లాగానే పెద తిరుమలాచార్యుడు జానపద గేయ రీతుల్ని వాడుకొన్నాడు- అందులో చందమామ పదప్రయోగం మనోజ్ఞం.

"సారెకు మగనాలి సంగాతమిది అట్టు చందమామా, నీవు
చేరి దగ్గరితే చీకటి తప్పవును చందమామా" (శృం.సం. 23-576)

—ఇలాగే భక్తి, నీతి, వైరాగ్యాదుల ప్రబోధంలో తండ్రి అడుగుజాడల్లోనే నడచి శ్రీ వేంకటేశ్వరుని సేవించిన మహనీయుడు.

తాతతండ్రులలాగే చిన తిరుమలాచార్యుడు శ్రీ వేంకటేశ్వరస్వామి కైంకర్య కార్యక్రమాన్ని కొనసాగించడమేకాక, భక్తిశ్రద్ధల్ని ప్రకటిస్తూ, శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. భక్తి నీతి వైరాగ్యాలను ప్రబోధించాడు. అద్వైతంకంటే విశిష్టాద్వైతమే గొప్పదని ప్రకటించాడు. కులం కన్న గుణం, గుణం కన్నా భక్తి ముఖ్యమని చెప్పాడు.

"కులమేమి సేసీని గుణమేమి సేసీని
నలువైన శ్రీ వేంకటనాథుడుండగా
అలరి వాల్మీకికి అలనా డహల్యకు
కులమేమి సేసెనయ్య గుణమేమిసేసె" (అధ్యా. సం. 16-43)

కాగా తన తాత అన్నమయ్య గొప్పదనాన్ని వర్ణిస్తూ, తన దైవమని తెలిపాడు.

"అప్పని వరప్రసాది అన్నమయ్యా
అప్పసము మాకె కలడన్నమయ్యా" (అధ్యా. సం. 16-23)

ఇలాగా తనయుడూ, మనుమడూ అన్నమయ్య అడుగుజాడల్లో నడుస్తూ వాగ్గేయకారులుగా, భక్తిప్రపత్తుల్ని చాటిన మహనీయులు.

అన్నివిధాలా అన్నమయ్యలాగా- ప్రధానంగా శృంగార పదరచనా వైవిధ్యంలోను, మధుర భక్తిప్రతిపాదనలోను, సంగీతసాహిత్యాలతోపాటు అభినయాన్ని పదంలో పుష్టిగా, తుష్టిగా నిరూపణం చేయడంలోను దివి సీమలో వెలసిన వాగ్గేయకార రత్నం క్షేత్రయ్య. అన్నమయ్య వారసత్వం పుణికిపుచ్చుకొన్ని మన సంస్కృతిని నిలబెట్టిన మహనీయుడు క్షేత్రయ్య. అన్నమయ్యతో ప్రారంభమైన పదం- క్షేత్రయ్యతో పదమంటే శృంగార పదమే అని స్థిరపడింది. తెలుగుబాస అన్నమయ్యతో ప్రారంభమై క్షేత్రయ్యతో మరింత తేటతేరింది. తెనుగు తియ్యందనం మనం చవిచూడవచ్చు. కాగా భావంలో, భావనలో, భావవ్యక్తీకరణలో, పదరచనాశిల్పంలో, వర్ణనలో, అలంకారంలో, భక్తి, మధురభక్తి, రక్తి- అనే అంశాల్ని అన్నమయ్యనుంచి పుణికిపుచ్చుకొన్నాడా క్షేత్రయ్య అనిపిస్తుంది. ఈ మహావాగ్గేయకారుల్లో పదరచనాశిల్పం- ఎలా తేటతెల్లమవుతుందో వీరి పదాల్లోని నికట సామ్యాన్ని పరిశీలిస్తే తెలుస్తుంది.

"చాలుచాలు ఈ చిన్నెలతో నాదు సరసకు జేరకుర ॥పల్లవి॥
చాలు ఈచిన్నెలు సాగవు నావద్ద మువ్వగో
పాల! భామవద్దికేపోర ॥అ.ప.॥
కన్నుల వీడెముతో కాటుక మోవితో
వెన్నున కిల్జడవేటుతోను
కన్నియసంపుల గాజులనొక్కులతోను
వన్నెకాడ నుదుటను నిండుబడలికతోను ॥చాలు॥

ఈ క్షేత్రయ్య పదాని కన్నివిధాలా మూలమేమో అనదగ్గ అన్నమయ్య పదం.

"ఎవ్వరు నెరుగరంటా యేలబొంకేరు
నవ్వేరు మిముజూచి నలినాక్షులెల్లను ॥పల్లవి॥
చెలియ నుదుటిమీది చిన్నారి కస్తూరిబొట్టు
చెలువమీరగ నీచెక్కులనంటె
నిలువు నామము నీది నెలత నుదుటనంటె
తలకొన్న గురుతులు తారుమారులాయను" ॥ఎవ్వరు॥

(24-477)

ఇందులోని భావం, భావన, భావుకత- నాయికానాయకుల వర్ణనలో విదితం. అన్నమయ్యలో వాచ్యంగా ఉన్న విషయాలను క్షేత్రయ్య వ్యంగ్యంగా, ధ్వనిపూర్వకంగా వివరించడం జరిగింది. గురువుకు వన్నె కూర్చాడు. ఇలాగా పదరచనా వైభవానికెన్నైనా ఉదాహరించవచ్చు. సంగీతానికి స్వరరాగతాళరసభావాలకు తగిన చక్కటి తెలుగును ప్రయోగించిన మహా వాగ్గేయకారుడు క్షేత్రయ్య.

ఈ సందర్భంలోనే మరో ఇద్దరు క్షేత్రయ్యకు సమకాలికులుగా పేర్కొనదగ్గవారు నారాయణతీర్థులు; సిద్ధేంద్రయోగి. నారాయణతీర్థులు సంస్కృతంలో శ్రీకృష్ణ లీలాతరంగిణి పేర శ్రీకృష్ణ బాల్యకథలు మొదలుకొని రుక్మిణీ కల్యాణం వరకుగల భాగవత కథను కీర్తనలలో రచించిన మహా వాగ్గేయకారుడు. ఇందులో ఆధ్యాత్మికపరమైన భక్తి శృంగారాల సమ్మేళన ముంది. ఈ తరంగాలు భక్తినీ రక్తినీ ప్రతిపాదిస్తూ ఉంటాయి. ఇలాగే సిద్ధేంద్రయోగి కూచిపూడిలో కూచిపూడిఅభినయాన్ని తెలుగుజాతి కిచ్చిన మహనీయుడు. భామాకలాపం, గొల్ల కలాపం- అభినయంలో మహనీయుడు ఈ సిద్ధేంద్రయోగి. మొవ్వలో వెలసిన క్షేత్రయ్య, కూచిపూడిలోని సిద్ధేంద్ర యోగి, నారాయణతీర్థులు సంగీతసాహిత్యాభినయాలకు ముగ్గురురత్నత్రయం. వీరిపై అన్నమయ్య ప్రభావం భక్తిలో, దాన్ని ప్రతిపాదించే అభినయంలో అందుకుపకరించే పదరచనలో దాగి ఉందనడంలో దోషం లేదు.

అన్నమయ్యలోని ఆధ్యాత్మికతను పరిపూర్ణంగా ఆకళించుకొని తదుచితంగా కీర్తనలు రచించిన వాగ్గేయకారుడు భద్రాచల రామదాసు. భక్తి ప్రపత్తిని భజన సంప్రదాయంలో ఇతణ్ణి అన్నమయ్యకు అక్షరాలా వారసుడని చెప్పవచ్చును. అన్నమయ్య సంకీర్తనలురచించగా, రామదాసు కీర్తనలు రచించాడు. భజన కూటములలో ప్రజలు గుంపులుగుంపులుగా ఆలపించి తరించడాని కుపకరించే సరళమైన కీర్తనలు రామదాసువి. రామదాసు భక్తిలో ఆర్తి నిండారి ఉంటుంది. ఆ ఆర్తి మనల్ని ఆకట్టుకొంటుంది. అన్నమయ్యలోని సాహిత్యసౌరభం రామదాసులో లేకపోవచ్చుగాక. కానీ లలితమనోహరంగా సామాన్య జనైకవేద్యంగా ఉండి సమ్మోహపరిచే తీరును గుర్తించగలము.

"కంటి మారాములను కనుగొంటి నేను ||కంటి||
కంటి నేడు భక్తిగణముల బ్రోచు మా
యింటివేలుపు భద్రగిరి నున్నవాని ||కంటి||

అనే రామదాసు కీర్తన- అన్నమయ్యపదం-

"ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు

నప్పడగు తిరువేంకటాద్రీశగంటి"- అన్నది మూలంలా ఉంది. అన్నమయ్య కలలో శ్రీ వేంకటేశ్వరుని- ప్రారంభంలో చూచి పరవశించి పాడుకొన్నాడు. రామదాసు భద్రాద్రి రాముని స్వయంగా చూచి పాడు కొన్నాడు. భక్తితోపాటు, నీతి, వైరాగ్యాదుల ప్రబోధం ఆధ్యాత్మికతాదృష్టితో ప్రచారం చేసిన వాగ్గేయకారుడు రామదాసు.

ఇలాగే అన్నమయ్య వారసత్వాన్ని పుణికిపుచ్చుకొన్న మరో వాగ్గేయ కారుడు సారంగపాణి; కార్వేటి నగరంలో వెలసిన వేణుగోపాలస్వామి మకుటంతో పదరచన చేసినవాడు; శృంగార, దేశీయ, జాతీయపదాలు, కీర్తనలు అని నాలుగు రీతుల పదరచన చేసిన వాగేయకారుడు. భాషలో, భక్తిరక్తుల్లో అన్నమయ్యను పోలినవాడు. అంతకంటే దేశీయ, జాతీయపదాల్లో ఆనాటి చిత్తూరు మండలం వాడుక భాషను ప్రయోగించిన పదకర్త. మొదట కార్వేటి నగర రాజుల ఆశ్రయంలో ఉండి, ఆవెనుక ఆశ్రయం పోయినాక గూడా పదరచన చేసినవాడు. ఇతడు భక్తి, నీతి, వైరాగ్యాలతోపాటు, శృంగారం, తత్వబోధన, జాతీయభావాభివ్యక్తిని ప్రచారం చేశాడు. భావోచిత మైన సంగీత ప్రతిపత్తిని ప్రదర్శించాడు సారంగపాణి.

ఒక మనోజ్ఞమైన శృంగారపదంలో నాయికనాయకుని తోడితెమ్మని చెలి నుద్బోధించే సందర్భంలోని సామ్యం గమనించగలము. సారంగపాణి పదం :

"రమ్మనే సామిని రమ్మనే ॥పల్లవి॥

కొమ్మనీవే నా మనవి గై
కొమ్మని వేణుగోపాలుని ॥అ.ప.॥

మచ్చుమీద నేనుండగ మచ్చుమీద జల్లినవాని ॥రమ్మ॥

ఇందుకాక కోర్వదంటె ఇందుకా కసరిందీవేళ ॥రమ్మ॥

—అనేది అన్నమయ్య పదంతో పోలి ఉంది.

"రమ్మనవే వాని రమ్మనవే యీ
తమ్మికనుగొనల తళుకులవాని ॥పల్లవి॥

మెలుపున నేను మేడమీద యీ
చిలుక చేరుకొని పిలువగను
అలపున వీథి దా నరుగుచును తను
బిలిచితి నంటా బలికినవాని ॥రమ్మ॥ (2-283)

అన్నమయ్య జానపద గేయరీతుల్ని వాడుకొన్నాడన్న విషయం పూర్వోక్తం. ఇద్దరి లాలిపాటల్లో సామ్యముంది.

సారంగపాణి : "లాలెనుచునూచేరు లలనలింపునను
శ్రీలచెన్నలరు నుయ్యాల పాన్పునను
గోల రుక్మిణీదేవి కోరి పెంపునను
బాళితో వచ్చె నీపై తలంపుననూ ॥లాలీ॥ (సా.ప.199)

అన్నమయ్య : "లాలనుచునూ చేరులలన లిరుగడల
బాలగండనర గోపాల నినుజాల"

కాగా భక్తితోపాటు నీతివైరాగ్యాలను అన్నమయ్యలో లాగానే మనం సారంగపాణిలోను గమనించగలము.

అన్నమాచార్యుల్లోని భక్తితత్వాన్ని ఆధ్యాత్మికతను గ్రహించి మునిపల్లె సుబ్రహ్మణ్య కవి ఆధ్యాత్మ రామాయణాన్ని 104 కీర్తనల్లో రచించి తరించిన వాగ్గేయకారుడు. భక్తివైరాగ్య, వేదాంతవివరణలు ఈ కీర్తనల్లో ప్రాముఖ్యం వహించాయి. సంకీర్తన భక్తి అన్నమయ్యదైతే, కీర్తన భక్తి సుబ్రహ్మణ్య కవిది. సంకీర్తన రీతిని ప్రవేశపెట్టినవాడు అన్నమయ్య, ప్రథమాంధ్ర వాగ్గేయ కారుడు. ఆఖ్యానాత్మకంగా కీర్తన రచన చేసి, 104 కీర్తనలకు 58 రాగాలను ప్రయోగించిన ప్రముఖ వాగ్గేయకారుడు సుబ్రహ్మణ్య కవి. సంగీత సాహిత్య రచనల్లో తన ప్రత్యేకతను నిరూపించుకొన్న ఉత్తమ వాగ్గేయ కారుడు.

చివరిగా చెప్పుకోదగ్గ మహా వాగ్గేయకారసత్తముడూ, నాదోపాసనలో ముక్తుడైన మహనీయుడు త్యాగరాజు. సాహిత్యం ఆధారంగా సంగీతాని కిచ్చిన ప్రాముఖ్యం త్యాగరాజును ఈనాటికే గాదు ఇంకేనాటికైనా సంగీతాకాశంలో ధ్రువతారలా నిలుపుతుందన్న విషయం అక్షరసత్యం. అన్నమయ్యతో ప్రారంభమైన ఆధ్యాత్మికత త్యాగరాజుతో పరిపుష్టి పొందింది. ఆయన సాహిత్యం వెనుకదాగిన సంగీతం త్యాగరాజులో సాహిత్యం వెనుకబడి సంగీత

సామ్రాజ్యం జగజ్జేగీయమానంగావెలిగింది. పదం అన్నమయ్యతో సంకీర్తనగా ప్రారంభమై, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్యలతో కొనసాగి, క్షేత్రయ్యలో కేవలం శృంగారపదంగా ప్రసిద్ధిపొంది, సారంగపాణిలో పదంగా, కీర్తనగా ఉండి, రామదాసులో కీర్తనగా రూపుదిద్దుకొని, మునిపల్లె సుబ్రహ్మణ్య కవిలో అధ్యాత్మ కీర్తనగా విలసిల్లి, త్యాగరాజులో చక్కటి చిక్కటి సంగీత ప్రతిపత్తితో కృతిగా పలుపోకడలుపోయింది. త్యాగరాజుతో ధాతుమాతువుల్లో ధాతువుకే ప్రాధాన్యం. ధాతునిర్మాణ శిల్పనైపుణ్యానికి మాతువును సాధనగా ఉపయోగించుకొన్నాడు త్యాగరాజు.

భావంలో, భావనలో, భక్తిలో బహిరంతరముల అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని విశ్వసించి స్మరించినట్లే త్యాగరాజు శ్రీరాముని స్మరించి, స్మరించి తరించాడు. శ్రీరాముని తన నోముఫలంగా, జీవనాధారంగా చెప్పుకోవడంలో కాదు ప్రాముఖ్యం. అంతకంటే తనచూపు ప్రకాశంగా, నాసికాపరిమళంగా జపవర్ణరూపంగా, పూజాసుమంగా భావించడంలో త్యాగరాజు విశిష్టత, భక్తి పరతంత్రత విదితమవుతాయి.

"నా జీవనాధార నా నోముఫలమా
రాజీవలోచన రాజరాజశిరోమణి ॥నాజీవ॥

నా చూపుప్రకాశమా నా నాసికా పరిమళమా
నా జపవర్ణ రూపమా నాదు పూజాసుమమా
త్యాగరాజనుత ॥నా జీవ॥ (త్యా.కీ. 266)

ఎంత కృతి రచించినా శ్రీరామ భక్తిప్రపత్తిని నిరూపించడానికి శ్రీరామచంద్రుని సురూపాన్ని, సొగసుని చూసి, చూసి తనివిచెందని త్యాగరాజు ఎంత మనోహర సుందరంగా వర్ణించాడో అనుభవైకవేద్యం.

"సొగసు జూడతరమా నీ
నిగనిగమనుచు గపోలయుగముచే మెరయుమోము ॥సొ॥

అమరార్చిత పదయుగమో అభయప్రదకరయుగమో
కమనీయతను వందితకామ కామరిపునుత నీ ॥సొ॥

వరబింబసమాదరమో వకుళసుమంబుల యురమో
కరధృత శరకోదండ మరకతాంగవరమైన ॥సొ॥

చిరునవ్వే ముంగురులో మరి కన్నులతేటో
వర త్యాగరార్చిత వందనీయ ఇటువంటి ॥సొ॥

—ఇలాగా కన్నులకు కట్టేలా వర్ణించిన తీరు అమోఘం. ఇలాంటి పదాలు అన్నమయ్యలో కోకొల్లలు.

ఇలాగ భక్తి, నీతి, వైరాగ్యాలతో ఆధ్యాత్మికచింతనాపర తాత్విక బోధన మొదలైనవాటిలో త్యాగరాజులోను అన్నమయ్య ప్రభావం ఉండక తప్పదు. అయినా ఆ మహా వాగ్గేయకారుడు అనన్యసామాన్య ధాతు నిర్మాణ దక్షుడుగా సంగీత ప్రపంచంలో నిలిచిపోయాడు; అది ఆయన విశిష్టత.

ఇంతవరకు ప్రస్తావించబడ్డ తెలుగు వాగ్గేయకారుల అనంతరం కర్ణాటక పితామహుడుగా ప్రసిద్ధిగాంచిన పురందరదాసులోను అన్నమయ్య ప్రభావ ముందని మనం గ్రహించవచ్చు. పురందరదాసు అన్నమయ్యను తిరుమలలో అతని చరమదశలో దర్శించినట్లు తెలుస్తుంది. అందుకు నిదర్శనాలు ఉన్నాయి.

అన్నమయ్య ఆరాధ్య దైవం శ్రీ వేంకటేశ్వరస్వామి అయినా ఇతర దేవతలతోపాటు విఠ్ఠలుని స్మరించాడు. అదేరీతిగా తన ఆరాధ్య దైవం విఠ్ఠలుడైనా పురందరదాసు శ్రీ వేంకటేశ్వరుని స్మరించాడు.

అన్నమయ్య : "మొక్కలీడవయ్య నీవు ముద్దువిఠ్ఠలా మా
పక్కవాయ వెప్పుడును పండరంగి విఠ్ఠలా"
(శృం. సం. 24-369)

పురందరదాసు : "వేంకటాచల నిలయం వైకుంఠపురవాసం
పంకజనేత్రం పరమపవిత్రం
శంఖచక్రధరం చిన్మయరూపం." (1-71)
"తిరుపతి వేంకటరమణ నిను గేతకెబారదు కరుణ" (1-134)

అన్నమయ్య పురందరదాసుల అనేక పదాల్లో సామ్యం గోచరిస్తుంది. ఉదాహరణకి :

అన్నమయ్య : "శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీపతి వల్లభా
శరణు రాక్షస గర్వసంహర శరణు వేంకట నాయకా"

పురందరదాసు : "శరణుశరణు సురేంద్ర వందిత శరణు శ్రీపతి సేవితా
శరణు పార్వతి తనయ మూరుతి శరణు సిద్ధివినాయకా"

అన్నమయ్య : "నారాయణ తే నమోనమో
నారద సన్నుత నమోనమో"

పురందరదాసు : "నారాయణ తే నమోనమో భవ
నారద సన్నుత నమోనమో"

అన్నమయ్య : "ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశుఁగంటి"

పురందరదాసు : "కండెకండె స్వామియ బేడికొండె ॥పల్లవి॥
కండె తిరుపతి వేంకటేశన కారుణ్యాత్మక సార్వభౌమన
కామితార్థగళీవ దేవనె కరుణనిధి ఎందెనసి మెరెదవన॥అ.ప॥

ఈ రీతిగా అన్నమయ్య ప్రభావం పురందరదాసుపై ప్రసరించిన తీరు విదితమవుతుంది.

అన్నమయ్య మొదలుకొని తదితర వాగ్గేయకారుల లక్ష్యమొక్కటే. పండితులు మొదలుకొని పామరులదాకా పదరచనతో భక్తి నీతి వైరాగ్యాదులను సమ్మిళితం చేసి ఆకర్షించి, సమైక్యపరచి విశాల భారతావనిని ఒక్కటి చేయడమే లక్ష్యం. అందరిలోను సమైక్యం, సమభావం- చివరికి భక్తిద్వారా ముక్తి ! భిన్నత్వంలో ఏకత్వాన్ని గుర్తించడమే లక్ష్యం.

# 10. అన్నమయ్య, క్షేత్రయ్య - తులనాత్మక పరిశీలన

"తెలుగుపద కవితా కన్యకు పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య గారంటిని కాని జనకుడే క్షేత్రయ్య. తాత మొదలు పెట్టిన పనిని తలపాలము దాకా ఈడ్చిన తండ్రి ఈతడు." అని రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి మాటల్లో ఎంతో సామంజస్యముంది. తెలుగులో పదకవితను ప్రారంభించి, దానికి అస్తిత్వాన్ని సంపాదించి పెట్టినవాడు అన్నమయ్య. అన్నమయ్యతో ప్రారంభమైన పదకవిత క్షేత్రయ్యలో ఒక పరిపూర్ణ స్వరూపాన్ని పొంది, పదకవిత అంటే ఇది అని నిరూపించే సుస్పష్టరేఖలతో పరిఢవిల్లి ప్రాముఖ్యం పొందింది. అందుకే రాళ్ళపల్లివారు పదకవితను ప్రారంభించిన అన్నమయ్యను పితామహునిగా, ఆ పదకవితకు విశిష్టతను చేకూర్చిన క్షేత్రయ్యను తండ్రిగా అభివర్ణించటంలోని విశేషం.

జయదేవుడే 15వ శ॥లో అన్నమయ్యగా, తదనంతరం వందయేళ్ళకు క్షేత్రయ్యగా జన్మించాడని, భావించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి మాటలు ఇందుకు ఎంతగానో ఉపకరిస్తున్నాయి. రాళ్ళపల్లివారి మాటల్ని - పదకవితా ప్రారంభ వికాసాల నేపథ్యంలో వేటూరి వారి మాటలు పునస్థాపిస్తున్నాయి. ఈ ఇద్దరు మహనీయుల ప్రశంసలతో అన్నమయ్య క్షేత్రయ్యలకు గల సంబంధం వ్యక్తమవుతుంది.

అన్నమయ్య 1408 లో జన్మించి, 1503 లో దివ్యధామం చేరిన ప్రప్రథమాంధ్ర వాగ్గేయకారసత్తముడు. కడపజిల్లా తాళ్ళపాకలో జన్మించి, కాలాంతరంలో శ్రీవేంకటేశ్వరుని మహాభక్తుడై తిరుమలమీద నివసిస్తూ ఆ స్వామిమీద శ్రీవేంకటేశ్వరముద్రతో 32 వేల సంకీర్తనలు రచించిన మహనీయుడు. ఇవి శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ సంకీర్తనలు అని రెండు రకాలు. అలివేలుమంగా వేంకటేశ్వరుల అలౌకిక శృంగారాన్ని అభివర్ణిస్తూ శృంగార పదాలలో ఆధ్యాత్మిక సంపదనంతా కుప్పపోసి, ఆధ్యాత్మిక సంకీర్తనలతో ఆడిపాడి, తాను తరించి, ప్రజల తరుణోపాయం కోసం సంకీర్తన వాఙ్మయాన్ని సృష్టించిన మహా దార్శనిక స్రష్ట అన్నమయ్య.

క్షేత్రయ్య మొదటి పేరు వరదయ్య. కృష్ణాజిల్లా దివి సీమలోని మొవ్వలో 1590 లో జన్మించి, 1675 దాకా క్షేత్రయ్య జీవించినట్లు తెలుస్తుంది. ఎన్నో వేల పదాలు మొవ్వలో వెలసిన మువ్వగోపాలునిపై, అదే ముద్రతో శృంగారపదాలు రచించినప్పటికి మనకు ఈనాడు మూడువందల పైచిలుకు లభ్యమవుతున్నాయి. క్షేత్రయ్య యుగంనాటి నుంచి పదమంటే శృంగార పదమని ప్రఖ్యాతి లోకంలో లభించింది. అందుకు కారణం ఇతడు రచించినవి కేవలం శృంగారపదాలు మాత్రమే. అన్నమయ్య శృంగార ఆధ్యాత్మ పదాలు రచించగా క్షేత్రయ్య కేవలం శృంగార పదాలను మాత్రమే రచించాడు. వాస్తవానికి అన్నమయ్య పదాలలోని భాష లలితసుందరంగా ఉండి, సంగీతానికి ఒదిగినట్లు ఉండటం విశేషం. తిక్కన తర్వాత తెలుగుదనానికి ప్రాముఖ్యం ఇచ్చిన మహనీయుడు అన్నమయ్య. అంతకంటె పలుకు పలుకున తేనెలొలుక బలికిన క్షేత్రయ్య పదాల్లోని భాష మరింత మనోహరమే కాదు, మధురమంజులము. ఈ మహా వాగ్గేయకారుల భాషలో తెలుగుదనం, పలుకుబడి, నుడికారం ఉత్తరోత్తరం బలీయంగా, విశిష్టంగా ఉండటం విశేషం. ఆ వాగ్గేయకారులు చేసిన సేవ భాషాపరంగా ఇది అని గుర్తించ గలం. అంటే పద్యకవుల భాషలో లేని సారళ్యసౌలభ్యాలు ఈ పదకవులు సాధించారని స్పష్టమవుతుంది.

పద్యకవిత ప్రాభవంతో రాజ్యమేలుతున్న రోజులలో అన్నమయ్య భక్తి నీతి వైరాగ్యాలతోపాటు ఆధ్యాత్మిక చింతనాపరతను ప్రకటించటం కోసం, ప్రజలను ప్రబోధించటం కోసం పదరచనను చేసి వాగ్గేయకారుడుగా ప్రఖ్యాతి గడించాడు. పద్యంకంటే భక్తి బోధనకు పాట అనువైందని అన్నమయ్య గ్రహించాడు. అందుకే శృంగారపదాలు రచించినా అందులో మధురభక్తిని సమన్వయించి, జీవాత్మ పరమాత్మలో సమైక్యం చెందడానికి అవసరమైన రీతిలో ప్రబోధించాడు. అధ్యాత్మ సంకీర్తనలను, భక్తి నీతి వైరాగ్య భావనతో ఆధ్యాత్మికతను ప్రజల్లో నాటుకొనేట్లు చేయడానికి రచించి ధన్యుడయ్యాడు. శృంగార సంకీర్తనల్లో నాయిక అంటే జీవుడు అన్నమయ్యగా, నాయకుడు భగవంతుడు శ్రీవేంకటేశ్వరునిగా భావించి వివిధ విధాల శృంగార రీతులతో భక్తుడు భగవంతుని చేరడానికి చేసే ప్రయత్న రీతుల్ని పలురీతుల వర్ణించాడు. అధ్యాత్మ సంకీర్తనల్లో ఇందాకే చెప్పినట్లుగా లోకవ్యవహార సముదాచారరీతుల్ని ఉదాహరిస్తూ వివిధ పద్ధతుల్లో భగవ

ద్భక్తిని, సమాజంలో పాటించవలసిన నీతిని, చివరిదశలో వైరాగ్యాన్ని పాటించే పద్ధతిని అన్నమయ్య వేనోళ్ళ వర్ణించి, వివరించి తరించాడు. క్షేత్రయ్య కేవలం శృంగారపదాలనే రచించినప్పటికి అందులో నాయికా నాయక - పతిపత్నీభావ సమున్మేషంగా శృంగారాన్ని వర్ణించినా జీవాత్మ పరమాత్మల భావాన్ని మధురభక్తిభావ పరిపూరితంగా రచించి ప్రచారం చేసిన మహనీయుడు. మొవ్వలో జన్మించినా మధుర, తంజావూరు నాయక రాజుల ఆదరాభిమానాలకీ, గోల్కొండ పాదుషా గౌరవాదరాలకు పాత్రుడై ఈ మధురభక్తితత్త్వాన్ని దక్షిణదేశమంతటా ప్రచారం చేసిన ఘనత క్షేత్రయ్యది.

అనాటినుంచి క్షేత్రయ్య పదాలు సంగీత సాహిత్య సమ్మిళితమై ఉన్నప్పటికి అభినయానికి గొప్పదనం ఈనాడూ దక్షిణదేశంలో అభినయానికి ఉపకరించే పదాలు క్షేత్రయ్య పదాలే. ఇప్పుడిప్పుడే అన్నమయ్య పదాలు కూడ ప్రచారంలోకి వస్తున్నమాట వాస్తవమే. ఇక్కడ పెద్దలు చెప్పిన మాటలు గుర్తుంచుకోవడం అవసరం. అన్నమయ్య పదాల్లో సాహిత్యము ప్రధానమై సంగీతం గౌణంగానూ, క్షేత్రయ్యపదాల్లో సంగీత సాహిత్యాలు సమ్మేళనమై అభినయానికి ప్రాధాన్యమున్నదని, త్యాగరాజు చేతులలో సంగీతం ప్రధానమై సాహిత్యం గౌణమైందని చెప్పిన పెద్దల మాటలు వాస్తవమనిపిస్తుంది.

అన్నమయ్య రచించిన 32వేల పదాలలో సగానికి సగం ఈనాడు లభిస్తున్నాయి. అన్నివేల పదాలలో అన్నమయ్య వాడిన రాగాలు సుమారు వంద. ఆనాటికే అపురూపమైన రాగాలను ప్రయోగించినట్లు సంగీత శాస్త్రజ్ఞుల వక్కాణ లభించిన క్షేత్రయ్య పదాలలో - అన్నమయ్యతో పోల్చి చూసినప్పుడు చాల తక్కువ - సుమారు 50 రాగాలు వాడినట్లుగా పెద్దలు నిర్ణయించిన విషయాన్ని పరిశీలిస్తే అన్నమయ్య తరువాత 100 ఏళ్ళకు జన్మించిన క్షేత్రయ్య ప్రయోగించిన రాగాల సంఖ్య అధికమనిపిస్తుంది. అందువల్ల సంగీత విషయంలో కూడ క్షేత్రయ్య అభినయంతోపాటు సాధించిన ప్రయోజనం ద్వారా మహా వాగ్గేయకారుడుగా మనం గుర్తించగలుగుతాము.

ఈ మహావాగ్గేయకారుల పదకవితా వైభవం సహృదయ హృదయ రంజకమై, అత్యంత రసానందానుభూతుల్ని కలిగించి పరమానందభరితుల్ని చేస్తుంది. పల్లవి, అనుపల్లవి సామాన్యంగా మూడు చరణాలతో పదం

ఒప్పుతూ ఉంటుంది. ఒక్కొక్క పదమూ స్వయంసంపూర్ణమై, రససంభరితమై, సహృదయరంజకమై అనంతానందాన్ని కలిగిస్తుంది. అంటే ఒక్కొక్కపదమూ ఒక్కొక్క ముక్తకం. అన్నమయ్య అనేకపదాల్లో పల్లవి, చరణాలు ఉంటాయి. సకృత్తుగా అనుపల్లవి కనిపిస్తుంది. క్షేత్రయ్యలో పల్లవి, అనుపల్లవి, చరణాలు సామాన్యలక్షణం. కేంద్రబిందువైన ఒక భావాన్ని పల్లవిలో ప్రారంభించి, అనుపల్లవిలో ద్విగుణీకృతం చేసి, చరణాల్లో రసభావాలను విస్తరింపచేసి, సహృదయరంజకం చేసి సంగీతంతో, అభినయంతో పారవశ్యము చెందించటం ఏపదంలో అయినా ముఖ్య విషయం.

అన్నమయ్య ప్రారంభంలోనే పేర్కొన్నట్లు పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడుగా ప్రసిద్ధికెక్కాడు. క్షేత్రయ్యను పదకవితా చక్రవర్తిగా మనం గుర్తిస్తున్నాము.

అన్నమయ్యకు చక్కటి అనుయాయి క్షేత్రయ్య. భావంలో, భావనలో, పదరచనాశిల్పంలో, వర్ణనలో. అలంకార ప్రయోగంలో భక్తి, మధురభక్తి, రక్తి అనే అంశాల్లో అత్యంత సన్నిహితంగా ఉంటూనే మరింత ముందుకు వెళ్ళినవాడు క్షేత్రయ్య. నాయికానాయక వర్ణనలో క్షేత్రయ్య సూక్ష్మాతి సూక్ష్మంగా తన ప్రతిభను ప్రకటించినట్లు స్పష్టమవుతుంది.

"ఏల వలచితి నోయమ్మా ! ఎట్లా వేగింతునే కొమ్మా ! ॥పల్లవి॥
ఈలాగౌట ఎరుగనైతి - యెదుగిరి చెలువరాయనిపై ॥ఏల॥
ఉన్నచోట నుండనీదు ఒరగుపై నన్నొరగనీదు
అన్నాహారము లేదు నానబాలు తేనె చేదు ! ॥ఏల॥

అని విరహోత్కంఠిత అయిన నాయిక వేదనని అమోఘంగా వర్ణించాడు క్షేత్రయ్య.

ఇలాగే అన్నమయ్య నాయికా విరహాన్ని గూర్చి వర్ణించినతీరు అమోఘం. నాయికా విరహాన్ని గూర్చి చెలులు నాయకునకు తెలుపాలనుకున్న అంశం ఈ క్రింది పదంలో వర్ణితం.

"ఇందు మీఁద సతిభావ మెట్లౌనో యేమౌనో
విందుగాఁ జెలువునికి విన్నవించరే ॥పల్లవి॥
కోవిల కూఁతకుఁగానే గుండె జల్లురని చెలి
పూవక పూచిన యట్టు పులకించె

పోవులైన పుప్పొడినే పోయరే బడిమి" ॥ఇందు॥

కుపిత అయిన నాయిక చెలులతో నాయకుని గూర్చి చెప్పడం.

క్షేత్రయ్య :

"అడుగరమ్మా యతనిపై నూరక అలిగినా నటరే
పడుచుతనము మాని మువ్వగోపాలరాయుని ఆనబెట్టి మీా ॥రడుగ॥
[సీ.గి.వెం.స్వీ. 4]

అన్నమయ్య :

"ఏది నిజమని మీరు యెట్టు వొడబడచేరే
ఆదినుండి యీ కతలు అడుగరే యాతని" [26-430]

క్షేత్రయ్య మనోజ్ఞ పదరచనలో మహాశిల్పి. చిత్రకారుడికి, శిల్పికి సాధ్యముకాని రీతిలో పదరచన చేసి క్షేత్రయ్య శిల్పంలో అమరుడయ్యాడు. నాయకుని రతి అనంతరం వేషాన్ని తిలకించిన నాయిక ఆయన అన్యకాంతా భోగ చిహ్నాలను కాంచి తన సరసకు చేరకుమని తోసిపుచ్చుతూ ఉంది ఈ పదంలో—

"చాలు చాలు ఈ చిన్నెలతో నాదు సరసకు జేరకుర ॥పల్లవి॥
చాలు ఈ చిన్నెలు సాగవు నావద్ద మువ్వగో
పాల ! భామవద్దకే పోర ॥అ.ప॥

ఈ క్షేత్రయ్య పదానికి అన్నివిధాల మూలమేమో అనదగ్గ అన్నమయ్య సంకీర్తనలు ఉండటం విశేషం.

"ఎవ్వరు నెరుగరంటా యేల బొంకేరు
నవ్వేరు మిమ్ముజూచి నలినాక్షు లెల్లను ॥పల్లవి॥

చెలియ నుదుటిమీది చిన్నారి కస్తూరిబొట్టు
చెలువుమీరగ నీ చెక్కులనంటె
నిలువు నామము నీది నెలత నుదుట నంటె
తలకొన్న గురుతులు తారుమారు లాయను ॥ఎవ్వ॥

అన్నమయ్య పదాన్ని ఎదుట పెట్టుకొని క్షేత్రయ్య పదరచన చేశాడా అన్నంత సన్నిహితంగా ఉందీ రచన. భావం, భావన, ప్రతిభ, ప్రయోగం

అన్నివిధాల కుదిరి సమానస్థాయిలో ఆ మహా వాగ్గేయకారు డొకడేనా అన్నట్లు ఉండటం అబ్బురం గొలిపే అంశం. అయితే అన్నమయ్యలో వాచ్యం పాలు ఎక్కువ. క్షేత్రయ్యలో వ్యంగ్యం, ధ్వని ఉన్నాయి. అన్నమయ్య భాషలో బరువుంది. క్షేత్రయ్యలో లాలిత్యముంది. సారళ్యముంది. ఇది ఆ మహా వాగ్గేయకారులలో కనిపించే ప్రతిభా పాటవం; అనల్ప కల్పనాశిల్పంతోకూడిన పదరచనా వైభవం. సహృదయ రంజకమై అనంతానందాన్ని కూరుస్తూ వారి గొప్పతనం వ్యక్తమవుతుంది.

ఇద్దరు మహా వాగ్గేయకారుల్లో రత్యనంతర నాయకుల వేషాన్నిగూర్చి తెలుసుకున్నాము. ఇలాగే రత్యనంతర నాయికా దర్శన మిద్దరు వాగ్గేయ కారులు చేసినతీరు అనన్య సామాన్యం. అయితే క్షేత్రయ్య నాయిక కేళికా మందిరం వదలి వెళ్ళినట్లు వర్ణిస్తే, అన్నమయ్య నాయిక పవళించినట్లు చిత్రించాడు. అన్నమయ్య పదమే క్షేత్రయ్యకు మూలమా అన్నట్లు ఉండటం విశేషం.

క్షేత్రయ్య :

"మగువ తన కేళికామందిరము వెడలెన్
వగకాడ మా కంచి వరద తెల్లవారెననుచు ॥పల్లవి॥

విడజారు గొజ్జంగి విరిదండ జతతోను
కడు చిక్కువడి పెనగు కంట సరితోను
నిడుద కన్నులదేరు నిదురమబ్బుతోను
తొడరి పదయుగమున తడబడెడు నడతోను" ॥మగువ॥

ఇది క్షేత్రయ్య అత్యుత్తమ పదాల్లో ఒకటి. దీనికి మూలమన్నట్లున్న అన్నమయ్య పదమిది.

"పలుకు దేనెల తల్లి పవళించెను
కలికి తనముల విభుని గలిసినది గాన ॥పల్లవి॥

నిగనిగని మోముపై నెరులు గెలకుల జెదర
పగలైనదాక దరిజెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారిన దాక
జగదేకపతి మనసు జట్టి గొనెగాక" ॥పలుకు॥

అన్నమయ్య క్షేత్రయ్య ఇద్దరు వాగ్గేయకారులు నాయికా చిత్రాన్ని నాయకుడు చిత్రించబోయి భ్రమతో మరచిపోయే మనోజ్ఞమైన నిర్మలాను రాగం పదాలలో చిత్రించిన అక్షరచిత్రకారు లీ వాగ్గేయకారులు.

క్షేత్రయ్య :

"ఏమి చేయుదు మోహ మెటువలె దీరును ॥పల్లవి॥
భామినీమణిని యెవ్వరు తోడితెచ్చేరు ॥అ.ప.॥
'చెలది నీదు ముఖారవిందంబు లిఖియించి
అలరు వాసనలు వ్రాయగ నేరనైతి
కళలొల్కు నీమోవి గదసి వ్రాసితినిగాని
నెలత తేనియలుంచ నేరనైతి" ॥ఏమి॥

అన్నమయ్య :

"ఒకటికొకటి యాసనుండ జెలిభావమిది
మొక మెదుటనె నన్నుమోవ వ్రాసెనే ॥పల్లవి॥
పొలతి కురులు వ్రాయబోతే తుమ్మిదలాయ
తలగకుండ మోముదమ్మి వ్రాసి, నే
కలిగి కన్నులు వ్రాయగ గండుమీలై పొడచూపె
చెలపచెమట నీటి చెక్కులు వ్రాసి నే ॥ఒక॥"

ఇలాగ సమానభావాల వ్యక్తీకరణకై చక్కటి పదరచన చేసిన మహనీయులు ఈ వాగ్గేయకారు లిద్దరు.

ఇంకా అన్నమయ్య క్షేత్రయ్య భాషా, పదాల ప్రయోగాలు సమానంగా ఉండటం మరో విశేషం. మందిమేళము, తరితీపు, మోవనాడవద్దు, దక్కగొను, అసురుసురు, చెరగుమాసిన, పొంచులేల వినేవే, వదరక, మొరతోపు, యెమ్మెలు, ఎటువంటి వలపో, ముయికిముయి, మంకు, చేసబెల్లతనము, ఇన్నాళ్ళవలె గాదమ్మా, అయనాయ, సేనా సేనా - మొదలైన పదాలు పలు చోట్ల ప్రయోగించి ఈ పదాలకు ఎంతో విశిష్టతను సాధించారీ వాగ్గేయకారులు.

ఈ విధంగా అన్నమయ్య క్షేత్రయ్యలు ఉత్తమ వాగ్గేయకారులుగా అంటే - రాళ్ళపల్లి వారన్నట్లు పితామహ జనకులుగా పదరచనలో విశిష్టతను

సాధించిన మహా వాగ్గేయకారులు. క్షేత్రయ్య అన్నమయ్య అంతటి వాగ్గేయ కారుడు అని అనటంకంటే కొన్ని అంశాలలో అన్నమయ్య కంటే క్షేత్రయ్య ఒకమెట్టు అధిగమించాడన్నా తప్పులేదు. సంగీతంలో, సాహిత్యంలో అంత కంటే అభినయంలో క్షేత్రయ్య విషయంలో ఇది వాస్తవమనిపిస్తుంది. పూర్వోక్తమైనట్లు క్షేత్రయ్య ఎన్నో అపురూప రాగాల్ని వాడుకచేసి అన్న మయ్య తరువాత సంగీతానికి తుష్టిని, పుష్టిని చేకూర్చాడు. అన్నమయ్య సంకీర్తనల్లో అణగి మణిగి ఉన్న అభినయము క్షేత్రయ్య శృంగార పదాల్లో ప్రాముఖ్యానికి వచ్చింది. తద్వారా క్షేత్రయ్య అభినయాచార్యుడయ్యాడు. దీనికి కారణం సమకాలికంగా ప్రసిద్ధిపొందిన కూచిపూడి నాట్యం కావచ్చు. నారాయణతీర్థుల తరంగాలు, క్షేత్రయ్య పదాలు కూచిపూడి నాట్యంలో ఒక భాగమని మనందరికి తెలుసు. అయినా వయసులో కొంత పెద్దవాడైన నారాయణతీర్థులు, వయసులో కొంత చిన్నవాడైన నాట్యస్రష్ట సిద్ధేంద్రయోగి సమకాలికులు కావటం ఇందుకు కారణం కావచ్చు. ఏమైనా అన్నమయ్య పద కవితా పితామహుడు. క్షేత్రయ్య పదకవితా చక్రవర్తి. అన్నమయ్య, క్షేత్రయ్యలు ఆంధ్ర మహా వాగ్గేయకారుల్లో అమరులు.

# 11. అన్నమాచార్య సంకీర్తన సాహిత్య తత్త్వం

పరిచయం :

"శ్రుతులై, శాస్త్రములై, పురాణకథలై, సుజ్ఞానసారంబులై,
యతిలోకాగమవీథులై, వివిధ మంత్రార్థంబులై, నీతులై,
కృతులై, వేంకటశైలవల్లభ రతిక్రీడారహస్యంబులై,
నుతులై, తాళ్లపాక యన్నయవచో నూత్నక్రియల్ చెన్నగున్"
(సంకీర్తన లక్షణము-12)

తెలుగుసాహిత్య ప్రపంచంలో పద్యం తన ప్రాభవాన్ని ప్రకటించుకొనే సమయంలో తాళ్ళపాక అన్నమాచార్యులు పదకవితకు పట్టంగట్టి పదరచనచేసి, ఆడి, పాడి తాను తరించి ప్రజా సముదాయాన్ని తరింపజేయడానికి ప్రారంభించారు; సంగీతాన్ని సాహిత్యానికి జోడించి పదరచనద్వారా ప్రజలను చైతన్యవంతుల్ని చేయ యత్నించాడు. ఆనాడు సంక్షుభితమైన సమాజాన్ని సముద్ధరించడానికి సంకీర్తనసాహిత్య మెంతగానో ఉపకరించింది. పద్యం పండితైకవేద్యం; పదం పామరజన సముదాయానికి సులభంగా అర్థమయ్యేది. పైగా అందులో సంగీతప్రాముఖ్యం వల్ల పండిత పామరులందరినీ ఆకర్షించే విశిష్టగుణం దానికుంది. ఆనాడు అలాంటి మాధ్యమాన్ని స్వీకరిస్తూ అన్నమాచార్యులు (1408-1503) శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు 32 వేలు రచించి అలమేలుమంగా వేంకటేశ్వరుల అలౌకిక శృంగారం వివిధ రీతుల వివరిస్తూ, మధురభక్తి మాధుర్యాన్ని పంచిపెడుతూ, భక్తి, నీతి, వైరాగ్యాలను తెలుపుతూ పదరచన చేయడం ఒక విశేషం. సమకాలికంగానూ, అంతకుముందు తెలుగునాట ప్రచారంలో ఉన్న జానపదగేయరీతుల్ని నిబద్ధం చేసి, సంకీర్తన లక్షణం రచించి ప్రజలకు అందుబాటులోకి తెచ్చాడు. పదమే రచించినా పద్యకవుల కేమాత్రమూ తీసిపోని రీతిలో కవిత్వ కామనీయకం, రామణీయకం, ప్రతిభ, వర్ణనావైదగ్ధ్యం, వ్యంగ్యం, చమత్కారం ఆలంకారికశైలీవిన్యాసం, భాషావైదగ్ధ్యం, వైవిధ్యం, ప్రజలభాష, మాండలికం మొదలైన కవితాగుణాలతో పదరచనా వైశిష్ట్యాన్ని నిరూపించుకొన్న మహాకవి. లలితమూ, సరళమూ అయిన తియ్యని తెలుగుభాషతోపాటు ఉభయ

భాషాసాహిత్యాన్ని ప్రకటిస్తూ సంస్కృత సంకీర్తనలు ఉండడం ... అన్నమాచార్యుని విశిష్టత.

## 2.0 సాహితీ కుటుంబం :

అన్నమాచార్యుల కుటుంబమంతా మూడు తరాలదాకా సాహిత్య కుటుంబం కావడం విశేషం. తాళ్ళపాక వంశానికిది విశిష్టత. అన్నమాచార్యుల ఇద్దరు భార్యల్లో తిమ్మక్క, అక్కలమ్మలలో తిమ్మక్క విదుషీమణి; మంజరీ ద్విపదల్లో 'సుభద్రా కల్యాణ'మనే గేయకావ్యాన్ని రచించి తెలుగులో మొట్ట మొదటి కవయిత్రిగా ప్రఖ్యాతి గడించింది.

అన్నమాచార్యుల అక్కలాంబల సంతానం పెద తిరుమలాచార్యుడు (1458-1554). ఇతడు తండ్రిలాగే వాగ్గేయకారుడు. ఇతడు శృంగార, అధ్యాత్మ సంకీర్తనలతోపాటు వేంకటేశ్వరవచనాలు, శృంగారదండకం, చక్రవాళమంజరి, వేంకటేశ్వరోదాహరణ, నీతిశతకం, సుదర్శనరగడ, తెలుగు వచన భగవద్గీత రచించి దేశీసాహిత్యకారుల్లో విశిష్టుడయ్యాడు. తాతతండ్రుల మార్గాన్ని అనుసరించి శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించి పదకవితా స్రోతస్వినిని తెలుగుసాహిత్య మాగాణంలో పారించిన ఘనుడు చినతిరుమలాచార్యుడు(1488-1562). ఇతడు పెదతిరుమలయ్య మొదటికుమారుడు; ఇతడు సంకీర్తన లక్షణాన్ని అనువదించి, అష్టభాషా దండకాన్ని రచించాడు. పెద తిరుమలాచార్యుని నాల్గోపుత్రుడు చిన్నన్నగా ప్రసిద్ధికెక్కిన చిన తిరువెంగళ నాథుడు ఇతడు తాత అయిన అన్నమాచార్య జీవితచరిత్ర, పరమయోగి విలాసం, అష్టమహిషీకల్యాణం, ఉషాపరిణయమనే- కావ్యాలు ద్విపదాల్లో- రచించి ద్విపదకర్తగా ప్రఖ్యాతి గడించాడు. పెద తిరుమలయ్య రెండో, మూడో, ఐదో పుత్రులైన అన్నయ్య, పెద తిరువెంగళనాథుడు, కోనేటి తిరు వెంగళనాథుడు కవులుగా గానీ, పదకర్తలుగాగానీ ప్రసిద్ధిలేదు; కానీ విశిష్టాద్వైతమత ప్రచారంలోను, సంకీర్తనాలాపనంలోను ప్రసిద్ధి పొందినట్లు తెలుస్తుంది. చిన తిరుమలాచార్యుని పుత్రుడు తిరువేంగళప్ప రచించిన అమరుకం ప్రకటితం. ఇతని ఇతర రచనలు బాలప్రబోధిక. సుధానిధి ప్రకటించబడలేదు. ఇలాగా తాళ్ళపాక కుటుంబం కవితా కుటుంబం. అన్నమాచార్యులతో ప్రారంభమైన పదకవిత మూడు పూవులు, ఆరు ఫలాలుగా విలసిల్లింది.

## 3.0 అన్నమాచార్య బహుముఖీన వైశిష్ట్యం :

అన్నమాచార్య సంకీర్తన రచన- అంటే పదరచన చేసి సంగీతసాహిత్యాలను మేళవించి కేవలం పామరులనేగాక పండితులను సైతం పరవశింప జేయడంలో ఆయన విశిష్టత వ్యక్తమవుతుంది. పద్యాన్ని ఏదేని రాగానికి కూర్చి పాడవచ్చు. కానీ పదం ప్రయోజనం రాగతాళబద్ధంగా సంగీత మాధుర్యంతో పాడి అడి ప్రజలను పరవశింపజేయడమనేది ముఖ్యం. ఇందులో ధాతు మాతువుల ప్రాధాన్యం అపరిహార్యం. మాతువంటే వాక్కు, సాహిత్యం; ధాతువంటే గేయం, సంగీతం. ఈ రెంటిని వాక్కుని, గేయాన్ని కూర్చగల వాడు వాగ్గేయకారుడు.

## 3.1 వాగ్గేయకారుడు :

"వాఙ్మాతు రుచ్యతే గేయం ధాతు రిత్యభి ధీయతే
వాచం గేయం చ కురుతేయః స వాగ్గేయకారః"

ఈ వాగ్గేయకార లక్షణాలు మామూలు కవికుండే లక్షణాలకంటే ఎక్కువ.

"శబ్దానుశాసన జ్ఞానమభిధాన ప్రవీణత
ఛన్దః ప్రభేద వేదిత్వ మలంకారేషు కౌశలమ్."
"రసభావ పరిజ్ఞానం దేశస్థితుషు చాతురీ
అశేష భాషావిజ్ఞానం కళాశాస్త్రేషు కౌశలం."

ఈ పైని పేర్కొన్న వాగ్గేయకార లక్షణాలన్నీ అన్నమాచార్యులలో చూడగలము. లక్షణలక్షితంగా వేలపదాలు రచించి, సర్వాంధ్ర వాగ్గేయ కారులకు మార్గదర్శకుడయ్యాడు అన్నమాచార్యులు.

## 3.2 దేశీసాహిత్యం - పదరచన :

పదరచనతో అన్నమాచార్యులు దేశి సాహిత్యానికి పునాదులు వేశాడు. శృంగారమంజరి, శతకం మొదలైన రచన లనేకం చేయడంతోపాటు, శృంగార, అధ్యాత్మపదాలు శ్రీ వేంకటేశ్వర ముద్రతో రచించి మహా వాగ్గేయ కార సత్తముడై, పదకవితా పితామహుడుగా, సంకీర్తనాచార్యుడుగా ప్రసిద్ధి పొందాడు. తన సమకాలికంగా, అంతకంటే ముందే ఆంధ్రదేశంలో ప్రజల్లో ప్రచారంలో ఉన్న జానపద రీతుల్ని నిబద్ధం చేసి వాటికెంతో విశిష్టతనూ, ప్రాముఖ్యాన్ని ప్రచారాన్ని తెచ్చాడు అన్నమాచార్యులు.

"జోవచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామగోవిందా"

అనే ఈ జోలపాట తెలుగుతల్లులందరు పాడుతారు. ఇది అన్నమాచార్య జోలపాట.

ఇలాగే సువ్వి, చందమామ, తందనాన, గొబ్బిళ్ళు మొదలైన అనేక జానపద రీతులు అన్నమాచార్య పదాల్లో కోకొల్లలు. కోలాటం ప్రసిద్ధమే.

"గోవింద నందనందన గోపాలకృష్ణ నీ
భావముమాకుంజిక్కె గోపాలకృష్ణ"

ఇలాగే మరో గేయం-

"వాడేవాడే అల్లరివాడదివో
నాడునాడు యమునా నదిలో" (శృం. సం. 25-343)

ఇలాగా జానపద గేయరీతుల్ని ఎన్నింటినో తన సాహిత్యంలో ప్రయోగించి ప్రజాసముదాయాన్ని ఆకట్టుకొన్నాడు అన్నమాచార్యుడు.

**3.3 కావ్యరీతులు :**

అన్నమాచార్యుడు చేసింది పదరచన; పాడింది సంకీర్తనలు. అవి హరికీర్తనలు; ఆ పదాల్లో ఏ పద్యకవికీ తీసిపోనంత వైవిధ్యంతో కవితా రీతుల్ని కమనీయంగా, రమణీయంగా రచించి సహృదయరంజకం చేయడం విశేషాల్లో విశేషం.

అన్నమాచార్యుల భావుకత, ఊహాశాలిత, వాటి మూలంగా ఆతని ప్రతిభాపాటవం స్పష్టమవుతాయి. చక్కటి ఉదాహరణ.

"ఏమొకొ చిగురుటధరమున యెడనెడ( గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా ॥పల్లవి॥"

ఇందులోని అన్నమాచార్యుల భావుకత, దాన్ననుసరించిన భావమూ, దాన్ని అభివ్యక్తీకరించే భాష స్పష్టమై ప్రతిభాసంపద విశిష్టంగా విదితమవుతుంది.

అన్నమాచార్య పదరచనలో చమత్కారం.

"ఒకటి నొకటి గూడ దోయమ్మ నీయందే
సకలము నెటువలె సంతసేసితివే ॥పల్లవి॥

తానకు నీ కుచాలు దంతికుంభాలు బోలితే
యీ నడుము సింహము నేలపోలెనే
ఆనిపట్టి నీకన్ను లంబుజాల బోలితేను
ఆననము చందురు నదియేల పోలెనే ॥ఒకటి॥
అతివ నీచేతులు బిసాంగముల బోలితేను
యితవై నడపు హంసనేల పోలెనే
చతురత నాసికము సంపెంగ బోలితేను
తతి నీకురులు తుమ్మెదల నేలపోలెనే ॥ఒకటి॥

నేవళపు నీయారు నీలాహి బోలితేను
యీవల మేను మెరుపునేల పోలెనే
శ్రీవేంకటేశు మోవి చిన్ని కెంపులంటించి
ఆవేళ దంతాలు వజ్రాలై యెట్టుపోలెనే ॥ఒకటి॥
(శృం. 30-204)

ఒకటికొకటి విరుద్ధాలయిన అంశాలను నాయిక అవయవాల పరంగా చెప్పి చమత్కరించాడు కవి.

అన్నమాచార్యుని వర్ణనా వైదగ్ధ్యం అమోఘం, అసామాన్యం; తెలుగు పలుకుల తేటదనం, తియ్యందనం ఉట్టిపడేలా శ్రీకృష్ణ బాల్యక్రీడల వర్ణన అనితరసాధ్యం; అంత్యప్రాసాఘటితమై స్వభావోక్తిలో వర్ణితం.

"పసులు గాచేటికోల పసుపుచేల
పొసగ నీకింత యేల బుద్దుల గోల ॥పల్లవి॥

కట్టిన చిక్కపుబుత్తి గచ్చకాయలతిత్తి
చుట్టిన పించపు పాగచుంగల సోగ
ఇట్టి సింగారము సేయనింత నీకు బ్రియమాయ
వెట్టి నీచేతల మాయవిట్ఠల రాయ ॥పసులు॥

పేయల బిలుచుకూత పిల్లగోవిబలుమోత
సేయరాని గొల్లెతల సిగ్గులచేత
ఆయెడల తలపోత యమునలోపలి యీత
వేయరాని మోపులాయ విట్ఠలరాయ ॥పసులు॥

కుంకులేని పొలయాట కూరిములలోతేట
ఆంకెల బాలులతోడి యాటపాట
పొంకపు తుత్తురుకొమ్ము పొలుపైన నీసొమ్ము
వేంకటనగముచాయ విట్టలరాయ ॥పసులు॥

(శృం. 12-96)

—ఇందులో మరో విశేషం గమనించగలము. పల్లవిలోను, ప్రతి చరణం లోను, ప్రతిపాదంలోను యతిగలచోట విరిగి సగం సగం పాదాలతో అంత్య ప్రాస నియతంగా పాటించి సహృదయరంజకం చేయడం అన్నమాచార్యుల పదరచనాపాటవానికి నిదర్శనం.

ఇలాగే అన్నమాచార్యుల పదాల్లో వ్యంగ్యం, హాస్యం, ఆలంకారిక శైలీవిన్యాసం మొదలైనవాటితో కావ్యలక్షణలక్షితమై ఒప్పారుతూంటాయి.

ఏ పద్యకవిలోను చూడలేనంతగా అపురూపభావాలు, ప్రయోగాలు అన్నమాచార్య పదరచనలో మనం చూడగలము. ఆయన ప్రతిభాపాటవాలు మనల్ని అబ్బురపరుస్తాయి.

"అతనికొక్కతెవే నీ వాలువైతివా
సతులందరును నీసాటివారేకారా ॥పల్లవి॥

గాదెబోసుకొనేవేమే గంపముంచి వలపులు
పోదిచేసి రమణుని పొంత నీవుండి
పాదుసేసి విత్తేవేమే పదనుతో నీ సిగ్గులు
ఆదిగొని వన్నులు పయ్యద గప్పికప్పి ॥అతని॥

నెదజల్లేవేమే వెన్నెలవంటి నవ్వులు
కొదదీర నీతని కొలువునను
తుదబచరించేవేమే తొంగితొంగి నీచూపులు
చెదరిన నీకొప్పుచేతఁ బెట్టుకొంటాను ॥అతని॥

వొడిగట్టుకొనేమేమే వుబ్బరిసంతోసాలు
కడగి శ్రీవేంకటేశు కౌగిట గూడి
నడుమ నీవది యేమే నన్ను నీతండిపుడేలె
అడరి యలమేల్మంగనౌత నీవెఱగవానీ ॥అతని॥

(శృం. 29-37)

ఈ పదంలో నాయికతో తదిర నాయిక లంటున్నమాటలు. నాయకుడు దక్షిణ నాయకుడు. అందుకే నాయికలనేకలు. ఇందలి అపురూప భావాలు, తత్ప్రయోగమూ అన్నమాచార్యుని పదప్రయోగ దక్షత, భావసంపద స్పష్ట మవుతాయి.

## 3.4 శృంగారం, మధురభక్తి :

అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు అలమేలుమంగా వేంకటేశ్వరుల అలౌకిక శృంగార వర్ణనా వైవిధ్య రీతులకు చక్కటి నిదర్శనాలు. ఎన్నెన్నో కీతుల ఆ శృంగారాన్ని వర్ణించి తరించిన మహనీయుడు అన్నమాచార్యులు. నిర్మల ప్రణయంతో కూడిన శృంగారమంటే ఇలాంటిదని నిరూపించిన మహనీయుడు.

"వద్దు నన్ను జెనకకురా వాదేటికి
చద్దివేడికి పొలపు జంకెనలు మేలు ॥పల్లవి॥

వొలసి నొల్లముల హెందొనరించేకంటేను
అలవోకలైన పొలయలుక మేలు
కలసీకలయని మనసు కసుగాటుకంటేను
తలపులో నడియాస తమకమే మేలు ॥వద్దు॥

పచ్చిపెచ్చుల కూర్మి పచరించుకంటేను
కొచ్చి వూరకయుండు గుట్టుమేలు
వచ్చియును రాములను వడిదొరలు కంటేను
మచ్చరము మాని మెయిమరచుటే మేలు ॥వద్దు॥

తనిసియును దనివోని రతుల కంటేను
కనుగొనుచు జెలగు సంగతులే మేలు
మొనలేని శ్రీ వేంకటేశ యిన్నిటికంటే
నిను గలసియున్న నా నేరుపే మేలు ॥వద్దు॥

(శృం. 30-83)

అన్నమాచార్య శృంగార సంకీర్తనల్లో అలమేలుమంగ నాయిక, వేంకటేశ్వరుడు నాయకుడు; శ్రీ భూ నీళాదులు సవతులు. అప్పుడు నాయకుడు దక్షిణ నాయకుడు. సందర్భోచితంగా అన్నమాచార్యుడు శృంగార సహకారిణి అవుతాంటాడు. కొన్ని సందర్భాల్లో అన్నమాచార్యుడే నాయిక; అదే మధుర

భక్తి. విప్రలంభ, పూర్వరాగ విప్రలంభ, విరహ విప్రలంభ, ఈర్ష్యా విప్రలంభ, శృంగార రీతులతోపాటు సంభోగ శృంగారాన్ని అనితరసాధ్యంగా వర్ణించిన తీరు ప్రశంసాపాత్రం. సఖీ హితబోధ, దూతీ హితబోధ తానే ఆయా పాత్రలుగా వర్ణించాడు. స్వీయా, పరకీయ నాయికలతోపాటు అష్టవిధ నాయికలను వర్ణించిన అలంకారిక శాస్త్రవేత్త అన్నమయ్య. సామాన్య నాయిక ఈతని సాహిత్యంలో కానరాదు. ఇలాగే శృంగార లక్షణ శాస్త్రానుసారం చతుర్విధ నాయికలను ఒకే పదంలో అన్నమాచార్యుడు వర్ణించిన తీరు గమనించదగ్గది.

"కుందణంపు మైగొల్లెత తా
నెందును బుట్టని యేతరిజాతి ॥పల్లవి॥

కప్పులు దేలేటి కస్తూరి వంకల
కొప్పెర గుబ్బల గొల్లెత
చిప్పడు మట్టెల చల్లలమ్మెడి
అప్పని ముందట హస్తిణి జాతి ॥కుంద॥

దుంపవెంట్రుకల దొడ్డ తురుముగల
గుంపెన నడపుల గొల్లెత
జంపుల నటన చల్ల లమ్మెడిని
చెంపల చెమటల చిత్తిణిజాతి ॥కుంద॥

తీపున నఖములు వెడనెడ నాటిన
కోపపు జూపుల గొల్లెత
చాపున జట్టిగ చల్ల లమ్మెడిని
చాపేటి యెలుగున శంకిణిజాతి ॥కుంద॥

గారవమున వేంకటపతి కొగిట
కూరిమి బాయని గొల్లెత
సారెకు నతనితో చల్ల లమ్మెడిని
భారపు టలపుల పద్మినిజాతి ॥కుంద॥

(శృం. 12-92)

ఇంతవరకు అలమేలుమంగా వేంకటేశ్వరుల వివిధ విధ శృంగార రీతులను పరిశీలించాము. తరువాతది మధురభక్తి. శృంగార సంకీర్తనల్లో ఈ

మధురభక్తి కెన్నో ఉదాహరణలు చూపవచ్చు. అన్నమాచార్యుడే నాయిక అయి అంటే ఆత్మ, పరమాత్మ అయిన శ్రీ వేంకటేశ్వరునిలో సమైక్యం చెంద డానికి చేసిన యత్నం పదాల్లో చూడవచ్చు. ఈ క్రిందిపదంలో జీవాత్మ పరమాత్మల సంయోగం వర్ణితమై మధురభక్తి మకుటాయమానమై ఒప్పా తూండడం గమనించగలం.

"అదిగాక సౌభాగ్య మదిగాక వలపు
అదిగాక సుఖమింక నందరికి గలదా ॥పల్లవి॥
ప్రాణవల్లభునిఁ బెడబాసి మరుబాణముల
ప్రాణబాధల నెగులుపడుడేటి వలపే
ప్రాణేశ్వరుడు దన్నుఁబాయజూచిన యపుడు
ప్రాణంబు మేనిలో బాయంగ వలదా ॥అది॥
ఒద్దికై ప్రియునితో నొడగూడి యుండినపు
డిద్దరై విహరించు టిదియేటి వలపే
పొద్దుపోకలకు దమ పొలయలుక కూటముల
బుద్ధిలో బరవశము పొందంగ వలదా ॥అది॥
చిత్తంబు లోపలను శ్రీవేంకటేశ్వరుని
హత్తించి నాడుదానయి యుండవలదా
కొత్తయిన యిటువంటి కొదలేని సంగతుల
తత్తరము మున్నుడి తగులంగ వలదా ॥అది॥
(శృం. 12-230)

ఇది అన్నమాచార్య శృంగారం, మధురభక్తి మొదలైన విశేషాలు.

**3.5 ఆధ్యాత్మికత, భక్తి, నీతి, వైరాగ్యాలు :**

అన్నమాచార్యులు సంకీర్తనల్లో తన ఆధ్యాత్మికచింతనా పరత్వంతో భక్తిప్రపత్తినీ, నీత్యుపదేశరీతిని, వైరాగ్యస్వరూప నిరూపణను తద్వారా తన తాత్వికచింతనా వైవిధ్యాన్ని వివరించిన తీరును గమనిద్దాము. కలి యుగంలో విష్ణునామ సంకీర్తనం ముఖ్యమని నమ్మి తదుచితరీతిని సంకీర్తన సాహిత్యాన్ని సృష్టించారు అన్నమాచార్యులు.

"ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞై స్త్రేతాయామ్
ద్వాపరేఽర్చయన్ యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్యకేశవమ్"
(విష్ణుపురాణం 6-2-17)

హరినామ సంకీర్తనంలో 32 వేల సంకీర్తనలు రచించి అందులో భక్తిప్రపత్తి నెన్నోరీతుల చిత్రించి ప్రజాసముదాయానికి తరుణోపాయం చూపించాడు. అన్నమాచార్య సంకీర్తన సాహిత్యాన్ని ఆంధ్రవేదమని ప్రశంసించారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. కలియుగంలో తనసంకీర్తన వాఙ్మయం పంచమవేదంగా, శ్రీ వేంకటేశ్వర వేదంగా అన్నమాచార్యులే పేర్కొన్నారు. దానికి మూలం ఆళ్వారుల పాశురాలని తెలిపాడు.

"కలియుగంబునకు గలదిదియే
వెలసిన పంచమవేదమె కలిగె ॥పల్లవి॥
పరమగు వేదము బహుళము చదివియు
హరి నెరుగని వారరుదనుచు
తిరువాయి ముడియై దివ్యమంత్రమై
వెలసిన పంచమవేదమే కలిగె ॥కలి॥
బింకపు మనుజులు పెక్కులు చదివియు
సంకెదీర దెచ్చట ననుచు
సంకీర్తనమే సకల లోకముల
వేంకటేశ్వరుని మోదమె కలిగె ॥కలి॥

(అధ్యా. 11, 2-60)

భక్తి నవవిధాలనీ, దాన్ని ఒకేపదంలో చూపి, తన సాహిత్యమంతటా విస్తరిల్లజేశాడు అన్నమాచార్యులు.

"నిత్యసుఖానంద మిదె నీ దాస్యము
సత్యములేని సుఖాలు చాలుఁ జాలునయ్య" (అధ్యా. 10-78)

నవవిధ భక్తుల్లో ఆత్మనివేదనం అతిముఖ్యం. శరణాగతి, ప్రపత్తులలో సర్వం విష్ణుమయంగా భావించిన తీరుతెన్నులను వివరించాడు అన్నమయ్య.

సామాన్య ప్రజానీకాన్ని సముద్ధరించడానికే భక్తిబోధచేసి నీత్యుపదేశం చేశాడు అన్నమాచార్యులు. మనుజుడు ద్వంద్వాతీతుడు కావాలనీ "ఎండగాని.. (1-214)" ఎంత చదివినా, ఎంత విన్నా మానవుడు సచ్ఛీలుడు కావాలనీ, (ఎంత చదివిన నేమి వినిన....1-62). కులం గాదు గుణం ముఖ్యమనీ (ఎక్కువ కులజుడైన....1-318) వివరించాడు. ఇంకా పిపీలికాది బ్రహ్మాండ పర్యంతం బ్రహ్మమయమనీ, భగవంతుని సృష్టిలో అంతా సమానమని, హెచ్చుతగ్గులు మానవకల్పితమనీ-

"తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన"- అనే పదంలో
"నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే
అండనే బంటునిద్ర నదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే
చండాలుండేటి సరిభూమి యొకటే ॥తంద॥
(అధ్యా. 2-385)

—ఇలాంటి నీత్యుపదేశం చేసిన మహా ప్రబోధకుడు అన్నమాచార్యులు.

వైరాగ్యస్వరూప నిరూపణను గూడా కంటికి కట్టినట్టు తెలిపి, ఇదంతా అశాశ్వతమనీ, శాశ్వతమైన దానికై మనం ప్రయత్నించాలనీ అభివ్యక్తీకరించాడు అన్నమాచార్యులు. జీవయాత్రలోని లంపటులతో కాలాన్ని వృథా చేసుకొన్నానని బాధపడుతూ—

"అయ్యో పోయ బ్రాయము కాలము
ముయ్యంచు మనసుసనే మోహమతినైతి"- నంటూ
"అంతరాత్ముడు శ్రీవేంకటాద్రీశు గొలువ కిటు
సంతకూటముల యలజడికి లోనైతి" (అధ్యా. 1-179)

అని ఎంతో బాధని వ్యక్తం చేశాడు.

"ఎనుపోతుతో నెద్దు నేరుగట్టినయట్లు
యెనసి ముందర సాగదేటి బ్రదుకు" (అధ్యా 1-156) అని

విచికిత్సతో ఆలోచించి, భవబంధాలను తెంచుకొని ముక్తికాంతాబంధంలోకి వెళ్ళాలన్న విషయాన్ని వ్యవసాయంతో పోల్చి మనోజ్ఞంగా వైరాగ్యభావాన్ని వివరించాడు అన్నమాచార్యులు.

"పంటలభాగ్యులు వీరా బహువ్యవసాయులు
అంటిముట్టి యిట్ల గోపాడుదురు ఘనులు" (అధ్యా. 9-70)

—అని తెలిపి, "నానాటి బతుకు నాటకము / కానక కన్నది కైవల్య" మనీ (అధ్యా. 9-287).

"ఇన్నియుఁ జదువనేల యింకా నెదకనేల
కన్నుదెరుచు టొకటి కనుమూయు టొకటి" (అధ్యా. 10-44)

—అని జీవితం పుట్టుట, గిట్టుట- అంతేనని చాలా తేలికగా, సూటిగా వివరించి వైరాగ్యప్రబోధం చేశాడు ఆమహనీయుడు.

అన్నమాచార్యుని తాత్త్వికచింతనా పరత్వానికి పరమదర్శనం ఈ సంకీర్తన : "దేహినిత్యుడు దేహము లనిత్యాలు
యీహల నామనసా యిది మరువకుమా" (అధ్యా. 7-185).
అనే ఈ పదంలో "వాసాంసి జీర్ణాని"- అనే గీతా శ్లోకాలను (2-22, 23,24) వివరించాడు. ఇంకా శరీరాన్ని వీణగా, గుడిగా, రథంగా ఊహించి తదుచితరీతిని భగవంతుని మహిమాన్వితమూ, శాశ్వతమూ అయిన గుణాన్ని ఆడిపాడుకొన్నాడు అన్నమాచార్యులు.

ఇలా భక్తిభావనతో, నీతి వైరాగ్య తాత్త్వికతలను ఎన్నో రకాలుగా వివరించిన మహాప్రబోధకుడు అన్నమాచార్యులు.

అన్నమాచార్య పదరచనా వైశిష్ట్యం బహుముఖాల విస్తరించి పద్య కవులు చేయలేనంత సంగీత సాహిత్యాలకు సేవచేస్తూ సంక్షుభిత సమాజాన్ని సముద్ధరించడానికి పాటుపడినట్లు స్పష్టం. తద్వారా అన్నమాచార్యబహురీతుల వైవిధ్యపూరిత విశిష్టత స్పష్టమవుతుంది.

## 4.0 భాషా విశేషాలు :

పై విధంగానే అన్నమాచార్యులు భాషాపరంగా తానెంతో అత్యంత వైవిధ్య సంభరితంగా తెలుగుభాషా ప్రాముఖ్యాన్ని, ప్రాశస్త్యాన్ని ప్రసాదించి పెట్టాడు. తెలుగుదనానికి పట్టంగట్టిన మహనీయుడు తిక్కన. ఆవెనుక వేమన. వాగ్గేయకారుల్లో ప్రప్రథముడు అన్నమాచార్యులు; ఆ వెనుక క్షేత్రయ్య. అన్నమాచార్యులు మాండలిక భాషా ప్రయోగంతోపాటు తెలుగు తియ్యందనాన్ని రుచిచూపాడు తన పదాలద్వారా. ప్రప్రథమ వాగ్గేయకారుడైన అన్నమాచార్యుడు చేసిన భాషా సేవ అనన్యసామాన్యమైంది. కన్నడ భాష లోని హరిదాసుల్లో పురందరదాసు అంతకంటే అతని గురువు వ్యాసరాయలు, వారి గురువులు సంస్కృత పాండిత్య నిష్ణాతులైనా, కన్నడ భాషలోనే కీర్తనలు రచించి భాషాసేవ చేశారు. అదేరీతిగా అన్నమాచార్యుల భాషాసేవ గొప్పది. సంస్కృతాంధ్ర భాషల్లో నిష్ణాతుడైన అన్నమాచార్యుని తెలుగు లోని వేలపదాల్లో సంస్కృత సంకీర్తనలు సుమారు వంతదాకా ఉన్నాయి. ఇంతవరకు అన్నమాచార్యుల అనేకాంశాల విశ్లేషణలో ఉదాహరణగా పలు పదాలను చవిచూశాము; అందులో తెలుగుదనాన్ని రుచిచూశాము. అయినా మరో ఉదాహరణ : ప్రాపంచిక వ్యవహారాలను ఉదాహరిస్తూ చిన్నచిన్న

ప్రాణులే జీవితయాత్రకై శ్రమించే తీరు తెలిపి ఇక మానవుల లంపటలగూర్చి వివరించిన తీరులోని భాషసరళమూ, లలితమూను-

"తానెంత బ్రదుకెంత దైవమా నీమాయ యెంత
మానవుని లంపటాలు మరిచెప్పగలదా ॥పల్లవి॥

చెలగి నేలబారేటి - చీమసయితమును
కలసి వూరకేపారు గమ్మర నెందోమరలు
తలమోచి కాపురము ధాన్యములు గూడబెట్టు
యిల సంసారము దనకిక నెంతగలదో ॥తానె॥

ఏదో బాయిటబారే యీగ సయితమును
వాడుదేర నడవుల వాలివాలి
కూడబెట్టు దేనెలు గొందుల బిల్లలబెట్టు
యేడకేడ సంసారమిక నెంతగలదో ॥తానె॥

హెచ్చి గిజిగాండ్లు సయితమెంతో గూడువెట్టు
తెచ్చి మిణుగురు బురువు దీపమువెట్టు
తచ్చి శ్రీవేంకటేశ నీదాసులు చూచి నగుదు
రిచ్చల దానీ సంసారమిక నెంతగలదో (అధ్యా. 9-179) ॥తానె॥

చెప్పిన అంశాలన్నీ ప్రాపంచికమైనవి. అందుకు ఉపయోగించిన భాష అందరికీ అర్థమయ్యేది.

సంస్కృత పాండిత్య ప్రకర్షను సైతం సంకీర్తనలద్వారా అన్నమాచార్యులు నిరూపించుకొన్నాడు.

"అహో సురత విహారోయం
సహజ పరాజయ శంకానాస్తి ॥పల్లవి॥

యమునాకూలే సుమలతాగృహే
విమలసైకత వివిధస్థలే
రమణీరమణౌ రమత స్తయోః
ప్రమదస్య పరాత్పరం నాస్తి ॥అహో॥

రజనీకావా ప్రాతః కిం వా
త్యజనం భజనం తత్కిం వా
విజయః కోఽపజయః కోవా
భుజపరిరంభ స్ఫుటం నాస్తి ॥అహో॥

.............................

పరిమళభరిత ప్రచుర సుశీతల
వరమృదు వాయౌ వాతిసతి
తిరువేంకటగిరిదేవ రాధయో
స్ఫురసరతి సుఖశ్రాంతిర్నాస్తి ॥అహో॥ (శృం. 12-78)

—ఇందులోని విషయం జయదేవుని గీతగోవిందాన్ని గుర్తుకు తెస్తుంది. ఇలాగా ఎన్నేని ఉదాహరణ లివ్వవచ్చు.

అన్నమాచార్య సంకీర్తనల్లోని భాషావిశేషా లనేకం. ఇంతకుముందే మనం పరిశీలించాము. (1) అపురూప భావాలు, ప్రయోగాలలో భాషా విశిష్టతను గుర్తించాము. (2) పలుకుబళ్ళు, (3) జాతీయాలు, (4) సామెతలు మనం గుర్తించగలము. (5) చక్కటి లక్షణబద్ధమైన భాషాప్రయోగంతోపాటు సామాన్య ప్రజానీకాన్ని దృష్టిలో పెట్టుకొనీ, జానపదగేయరీతుల ప్రయోగం భాష సామాన్యమై వ్యాకరణానికి ఒదగని రీతిలోనూ ఉండడం కద్దు. (6) వింత ప్రయోగాలు, వింతపదాలు కోకొల్లలు. (6.1) వింతపదాలు; (6.2) వింత పదబంధాలు; (6.3) వైరిసమాసాలతోపాటు, వింతసమాసాలు విలక్షణ సమాసాలు; (6.4) వింత క్రియాపదాలు; (6.5) వింత వాక్యాలు; (6.6) అరబ్బీ, హిందీ, ఉర్దూ, తమిళం, కన్నడం మొదలైన అన్యదేశ్యాలు; (6.7) వీటన్నిటికంటే రాయలసీమ మాండలిక పదబంధాలు, క్రియలు, వాక్యాలు మొదలైనవి అన్నమాచార్యులలో మనం గమనించగలము.

## 5.0 సంగీతాభినయాలు :

అన్నమాచార్యులు బహుముఖీనమైన కళావేత్త, ప్రప్రథమ అత్యుత్తమ వాగ్గేయకారుడు. తన పదాల్లో ప్రయోగించిన 'సంగీత ప్రతిపత్తి' ఎంతటిదో విపుల చర్చ జరగవలసి ఉంది. అలాగే ఆ మహనీయుడు తన పదాల్లో అలమేలుమంగాదేవిచేత-

"అలరులు గురియగ నాడెనదే
అలకల గులుకుల నలమేలుమంగ ॥పల్లవి॥

అరవిరి సొబగుల నతివలు మెచ్చగ
అరతెర మరగున నాడెనదే
వరుసగ పూర్వదువాళపు తిరుపుల
హరి గరగింపుచు నలమేలుమంగ ॥అలరు॥ (శృం. 12-24)

'అరతెర మరగున' ఆడించిన నృత్యాభినయాలు, యక్షగానరీతి రివాజులను గురించి బేరీజువేసి నిర్ణయించవలసిన అవసరముంది.

## 5.1 జానపద విజ్ఞానం :

అన్నమాచార్యుల పదాల్లోని జానపద గేయరీతులను మనం చూశాము; ఇంకా ఆ మహనీయుని జానపదాంశం అనంతం. జానపద విజ్ఞానంలో భాగమైన పొడుపు కథలను- అంటే ఆయన మార్మికతను వివరించవలసి ఉంది.

"అంత సిగ్గువడకువే అతివ నీవు
పంతమున దెలియవే పాయమెల్ల గడువు ॥పల్లవి॥
గొందినొక్క సింహమట కొండలు మోచినదట
ఇందుముఖుల నడుమె ఇరువట
కందువ యీ పొడుపుడు గతయది నీవు నాకు
అందముగ నానతీవే ఆరునెల్ల గడువు ॥అంత॥
(శృం. 30-4)

## 5.2 అత్యవసరంగా చేయవలసిన కృషి :

సుదీర్ఘంగా ఇంతవరకు వివరించిన అన్నమాచార్యుల బహుముఖీన ప్రతిభాపాటవాల గూర్చి చేయవలసిన కృషి ఎంత త్వరగా సాధ్యమైతే అంత తొందరగా ప్రారంభించి సాగించవలసిన అవసరముంది. ఎందుకంటే ఆ మహనీయుడు పేర్కొన్న రీతి గమనిస్తే ఇది స్పష్టమవుతుంది.

"కడలుడిపి నీరాడగా దలచు వారలకు
కడలేని మనసునకు గడమ ఎక్కడిది ॥పల్లవి॥

దాహ మణగిన వెనుక తత్త్వమెరిగెద నన్న
దాహమే లణగు తా తత్త్వమేమెరుగు
దేహంబుగల యన్ని దినములకు పదార్థ
మోహమే లుడుగు దా ముదమేల కలుగు ॥కడ॥

ముందరెరిగిన వెనక మొదలు మరచెదనన్న
ముందరేమెరుగు దా మొదలేల మరచు
అందముగ దిరువేంకటాద్రీశు మన్ననల
కందువెరిగిన మేలు కలనైనలేదు ॥కడ॥

(అధ్యా. 1-226)

కాబట్టి మన పనులన్నీ చక్కబెట్టుకొని, ఎప్పుడో చేద్దామనుకోవడం ఆ మహనీయుని మాటలవల్లనే సాధ్యమయ్యే పనికాదు. సాధ్యమైనంత త్వరలో అన్నమాచార్య సాహిత్య పదప్రయోగకోశమూ, నిఘంటువు సిద్ధం చేయ వలసి ఉంది. అందుకు సంబంధించిన పెద్దలందరి మనసులను ఉన్ముఖు లను గావించాలని కోరుతున్నాను. అయ్యవారిని ఇంతవరకు ప్రశంసించాము గనుక- అమ్మవారిని సైతం ప్రార్థిద్దాము.

"ఏమని పొగడుదుమే యిక నిన్నును
ఆమని సొబగుల అలమేల్మంగ ॥పల్లవి॥

తెలిగన్నుల నీ తేటలే కదలే
వెలయగ విభునికి వెన్నెలలు
పులకల మొలకల పొదులివి గదవే
పలుమరు బువ్వుల పానుపులు ॥ఏమని॥

తియ్యని నీమోవి తేనెలే గదవే
వియ్యపు రమణుని విందులివి
ముయ్యక మూసిన మొలక నవ్వుగదె
నెయ్యపు గప్రముపు నెరివాగాలు ॥ఏమని॥

కైవసమగు నీకాగిలే గదవే
శ్రీవేంకటేశ్వరు సిరినగరు
తావుకొన్న మీతమకములే కదే
కావించిన మీకల్యాణములు ॥ఏమని॥

అలాగే అమ్మవారి దయ మనందరిపైనా ప్రసరించాలని ఆశిస్తున్నాను; ఆకాంక్షిస్తున్నాను.

## ఉపయుక్త గ్రంథాలు


1. ఆనందమూర్తి, వేటూరి : తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు-1974
2. ,, ,, తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషములు-1976
3. అన్నమాచార్యులు, తాళ్ళపాక : అధ్యాత్మ సంకీర్తనలు
4. ,, ,, శృంగార సంకీర్తనలు
5. గంగప్ప, ఎస్. : అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు- తులనాత్మక అధ్యయనం-1992
6. ,, ,, : అన్నమాచార్య సంకీర్తన సుధ-1995
7. ,, ,, : తెలుగులో పదకవిత-1983
8. ,, ,, : తెలుగు వాగ్గేయకారులు-1983
9. ,, ,, : పదకవితా పితామహుడు-1986
10. ,, ,, : పదసాహిత్య పరిమళం-1994
11. ,, ,, : క్షేత్రయ్య పదసాహిత్యం-1977
12. రజనీకాంతరావు, బాలాంత్రపు : ఆంధ్ర వాగ్గేయకారచరిత్రము-1975
13. సాంబశివరావు, గుమ్మా: అన్నమాచార్య సంకీర్తనలలోవర్ణనలు-1990
14. సర్వోత్తమరావు, కె : అన్నమయ్య-త్యాగయ్య 1983